ఫిబ్రవరి
1950

# చందమామ

వెల
0-6-0









CHANDAMAMA : STORY MAGAZINE FOR THE YOUNG



Chandamama, February, 1950

Photo by R. Krishnan

బిచ్చగాడు

## చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి


| విషయము | | పేజి |
|---|---|---|
| మాయదయ్యం | ... | 10 |
| ఊర్ణనాభుడు | | 12 |
| ఐదు ప్రశ్నలు | ... | 17 |
| రోజాసుందరి | ... | 25 |
| స్వర్గంలో ఒక చిత్రం | ... | 30 |
| వింత పావుకోళ్ళు | ... | 33 |
| మధుకైటభులు | ... | 39 |
| పుండరీకుడు | ... | 43 |
| పిల్లల పెంపకం | ... | 50 |
| అంకెల తమాషాలు | ... | 52 |
| అంపకాల పాట | ... | 55 |


ఇవన్నీగాక పజిలు, ముగ్గులు,
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు . 1686
మద్రాసు . 1.

# చందూయొక్క సాహసకృత్యములు


















ది టాటా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

●

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటె మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.



పొరుగింటి పైన ద్వేషాలు
పెరిగించితే రేగు రోషాలు
మరచిపో ఇక మత్సరాలు
పొరుగు సేమమే నీదు మేలు!

విజయా వారి....

# షావుకారు

[ఇరుగు పొరుగుల కథ]

దర్శకుడు — ప్రసాద్...

నిర్మాతలు — నాగిరెడ్డి :: చక్రపాణి...





# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 | ఫిబ్రవరి 1950 | సంచిక 2

ఇంచుమించు మూడువందల ఏళ్లుగా బ్రిటిష్ పాలనక్రింద ఉంటూవున్న మనకు మన బాపూజీ, తన అమోఘమైన సత్యాగ్రహ ఉద్యమంద్వారా బ్రిటిష్ వారితో శాంతియుద్ధం చేసి, 1947 ఆగస్టు 15-న స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టాడు.

ఆ స్వాతంత్ర్యం సుస్థిరంగా వెలసి, ఈ జనవరి 26-వ తేదిన మన భారతదేశం సర్వ స్వతంత్ర ప్రజారాజ్యం అయింది. ఈ సందర్భంలో మనదేశానికి క్రొత్త రాజ్యాంగంకూడా ఏర్పడింది. క్రొత్త రాజ్యాంగం క్రింద భారతదేశం 'రిపబ్లిక్' అని పిలువబడుతున్నది. మన రిపబ్లిక్‌కు పార్లమెంటు వున్నది. ఈ పార్లమెంటుకు ఒక అధ్యక్షుడు ఉన్నాడు. అధ్యక్షుని భవనం మీద ఎగిరే జెండా నమూనాయే ఈ నెల చందమామ అట్టమీద బొమ్మ. ఈ శుభ సమయం మనమందరమూ ఉత్సవాలతో ఎంతో సంతోషంగా గడిపాము. కాని ఇంతటి ఉత్సాహాన్ని కూర్చిన మన పూజ్య బాపూజీనీ, ఆయన మన భారతదేశానికి చేసినటువంటి అఖండ సేవనూ స్మరించటం మనందరకు విధి.

చ

# మాయ దయ్యం

సంతకు పోయిన గుర్వయ శ్రేష్ఠి
యింటికి పయనం పట్టాడు
కొంత దూరముకు పోయేవరకే
సాంతముగా ప్రొద్దోయింది.

బిక్కు బిక్కు మనుకుంటో అతడు
ఒక్కడె పయన మ్మయినాడూ
బక్క చిక్కినా చంద్రుడు పడమట
వెక్కిరింతగా వెలిగాడు.

గుడ్డి వెలుగులో గుండెలు పట్టుక
గురవయ గునగున పోతుంటే
వెనుక నెవ్వరో నడచినట్లుగా
వినికిడి చెవులకు సోకింది.

దయ్యా లంటే సెట్టికి పాపం
భయ్యం చిన్నప్పటి నుంచీ
తడబడతూ పడుతూ లేస్తూ
వడి వడిగా పోసాగాడు.

అన్ని భయాలకు అమోఘాస్త్రమూ
అంజనేయ దండక మనుకుంటూ
గురుతొచ్చిన కాసిని ముక్కలె,
మరల మరల వల్లించాడు.

మనసు నిలువక పోతూ పోతూ
వెనక్కి మళ్ళీ చూచాడు.
దయ్యం తరుముకు వస్తోందని గుర
వయ్యకు రుజువైపోయింది.

ఖంగా రతిశయించి మనిషికి
గంగురు లెత్తాయి- సరేలే-
భయపెడితే పోతుందేమో నని
భావించి, కన్ను లురుముతూ.
"భడవా ఎక్కడి కొస్తావే?" అని
చెడమడ చివాట్లు పెట్టాడు.

సిగ్గులేని ఆ దయ్యం కదలలేదు ;
పెట్టికి ఊపొక్కటి తట్టింది.
దెబ్బకు దయ్యం దడిసే మాటే
దబ్బున గురుతుకు వచ్చింది.

కొంకు విరగ వేస్తానంటూ
కంకర రాళ్ళకు వంగాడు.
పెట్టితోపాటూ దయ్యంగూడా
గుట్టమీదికే వంగింది.

నిట్టూర్పుచు 'ఇంతేనా ఇది నా
నీడేనా కట్టకడకు- అరరే-
అనుమానం పెనుభూతం బాబూ'
అనుకుంటూ ఇంటికి పోయాడు.

రచన: 'కవిరావు'













# ఊర్ణనాభుడు

మనం ఉండే ఈ లోకాన్నీ, దేవతలూ మొదలైన వాళ్ళంతా ఉండే తక్కిన లోకాల్నీ బ్రహ్మదేవుడు సృష్టిచేశాడు. సృష్టి చెయ్యటంలో తననేర్పంతా చూపి ఎంతో అందంగా చేశాడు గనుక బ్రహ్మదేవుణ్ణి అందరూ మెచ్చుకున్నారు. కాని ఊర్ణనాభుడనేవాడుమాత్రం మెచ్చుకోలేదు.

ఊర్ణనాభుడు విశ్వకర్మ కొడుకు. విశ్వకర్మ ఎవరంటే దేవతలకు మంచిమంచి మేడలూ, మిద్దెలూ, సభలూ, కట్టి ఇచ్చేవాడు. తోటలూ, ఉద్యానవనాలూ, వాటిల్లో చిన్నచిన్న సరస్సులూ ఇలాంటివన్నీ తయారు చేసిఇచ్చి, దేవతలకు ఆనందం కలుగ చేసేవాడు. అతని కొడుకు ఊర్ణనాభుడు తండ్రికన్నా నేర్పుకలవాడు. చూసినదల్లా చేసెయ్యగలడు అతను.

బ్రహ్మదేవుణ్ణి అందరూ మెచ్చుకోడం విని, "ఓస్, బ్రహ్మ గొప్పఏమిటి? ఇలాంటి లోకాలూ, వింతలూ నేనూ చెయ్యగలను" అంటూ బ్రహ్మకిమల్లేనే ప్రతీదీ చెయ్యటం మొదలెట్టేడు ఊర్ణనాభుడు.

ఊర్ణనాభుడు తనతో పోటీ చేస్తున్నాడని తెలియటంతోనే బ్రహ్మకి ఎక్కడలేని కోపం వచ్చేసింది. అతణ్ణి పిలిపించి "ఏమోయ్! నువ్వేదో తెలివైన వాడినన్న గర్వంతో నన్నే ధిక్కరిస్తున్నావే. 'తగుదునమ్మా' అని నాతో పోటికివస్తున్నావ్. నువ్వెంత చేసినా అది నా సృష్టిలాగా ఉంటుందా? నీ సృష్టి నీపేరుకు తగినట్లే ఉంటుంది. 'ఊర్ణనాభం' అంటే 'సాలెపురుగు' నీపని సాలెపురుగు కట్టిన గూడుకు మల్లే పైకి డాబేగాని, 'ఉఫ్' మని ఊదితే నిలవదు. అంచేత నాతో పోటీకిరాక, బుద్ధితెచ్చుకుని జాగ్రత్తగా మసులుకో" అని కూకలేశాడు.

కాని ఊర్ణనాభుడు ఊరుకోలేదు. "ఏమయ్యోయ్, నీ డబాయింపు నాదగ్గర

సౌభాగ్యలక్ష్మి, త్యాగరాయనగరం





పనిచెయ్యాదు. నన్ను మానుకోమనటానికి నువ్వెవరవు?" అని ఎదిరించాడు.

ఎంత మంచి దేవుడైనప్పటికీ ఎదిరిస్తే ఊరుకుంటాడా? బ్రహ్మదేవునికి పట్టరాని కోపంవచ్చి, "ఓరేయ్, ఊర్ణనాభా! వొళ్ళు తెలియకుండా మాట్లాడేవు గనుక నువ్వు పోయి, భూలోకంలో ఒక ఊర్ణనాభానివై (సాలెపురుగువై)పుట్టి, ఒక చెట్టుమీద గూళ్లు కట్టుకుంటూ ఉండు" అని శపించేశాడు.

ఇంకేముంది? శాపం తగలటంతోనే ఊర్ణనాభుడు గజగజా వణుకుతో బ్రహ్మదేవుని కాళ్లమీద పడి "దేవా, క్షమించు. నన్నుకాపాడు. సాలెపురుగు జన్మలోంచి తప్పించు" అని అనేకవిధాల ప్రాధేయపడ్డాడు.

బ్రహ్మదేవునికి జాలివేసింది. "నా శాపానికి తిరుగు లేదు. నీవు సాలెపురుగువై పుట్టిక తప్పదు. ఎటొచ్చీ ఆ జన్మలోనే నీకుమోక్షం వచ్చే ఉపాయం ఒకటి చెపుతాను విను. నువ్వు ఒక అడవిలో ఒక బిల్వావృక్షం మీద పుట్టబోతున్నావు. ఆ అడవిలోనే ఒకచోట శివుడు లింగమై వెలిశాడు. ఆ శివుడికి పూజచెయ్యటానికి భక్తుడొకడు బిల్వపత్రాలకోసం నీవున్న చెట్టు వద్దకు వస్తాడు. ఆ పత్రితోపాటు నువ్వు శివుని సాన్నిధ్యానికి చేరుకుని ఆ దేవుణ్ణి సేవించి మోక్షం పొందు" అని చెప్పేడు.

ఊర్ణనాభుడు శాపంప్రకారం ఆ అడవిలో బిల్వవృక్షం మీద సాలెపురుగై పుట్టేడు. సాలెపురుగై ఉన్నా, ఆతనికి పూర్వజన్మవృత్తాంతం అంతా జ్ఞాపకముంది. ఆ శివభక్తు డెప్పుడువస్తాడా, తన్ను శివలింగం వద్దకు ఎప్పుడు తీసుకుపోతాడా అని సాలెపురుగు ఆ చెట్టుమీదే కనిపెట్టుకుని ఉంది.

అలా కొంతకాలమయాక, బ్రహ్మచెప్పిన శివభక్తుడా చెట్టుదగ్గిరకొచ్చి ఆకులు కొయ్యటం మొదలెట్టేడు. సాలెపురుగు





మోక్షం సంపాదించుకుంటాను" అని నిశ్చయించుకుంది.

కాని ఆ సాలెపురుగుకు పట్టుకున్న ఆలోచన ఏమిటీ అంటే, "నేనుత్తి సాలె పురుగును. ఈ దేవుడికి పూజచెయ్యాలీ అంటే పువ్వులూ పత్రీ మొదలైన వెన్నో కావాలి. నేను వీటిని తేలేనుకదా, మరి ఈ దేవుడికి సేవచెయ్యటం ఎలాగా?" అని.

ఇలా ఆలోచిస్తూపోగా చటుక్కునే దానికో ఆలోచన తోచింది. "సేవించాలీ అంటే పువ్వులూ, పత్రీ తెచ్చే పూజించనక్కర్లేదు. నేను ఎంచక్క అందంగా గూళ్ళు కట్టగలను. ఈ దేవుడికి ఏ భక్తుడూ ఇంతా గుడికట్టించలేదు. నేను నాశక్తి అంతా ఉపయోగించి, ఈ దేవుడికి గుడీ, గోపురం అన్నీ కడతాను" అనుకుంది. అనుకున్న వెంటనే పని ప్రారంభించింది. సాయంకాలం అయేటప్పటికి, లింగానికి గుడీ, గోపురం, ప్రాకారం అన్నీ కట్టేసింది. వేటితో కట్టిందో తెలుసా? ఇటుకలూ, రాళ్ళూ, సున్నంతోనూ కాదు. సాలెపురుగు ఇవన్నీ ఎక్కడ తేగలదు? సాలెపురుగుకి తన బొడ్డులోనే ఒక రకం జిగురుంటుంది. ఆ జిగురుతోనే జలతారుపోగులకు మల్లే

అతను అకులుకోస్తున్న కొమ్మమీదికెళ్ళి, ఒక అకులో దూరి, ఆకుతోబాటు తాను కూడా అతని బుట్టలోకి చేరుకుంది. అతడా పత్రిఅంతా తీసుకెళ్ళి, ఆ అడవిలోనే వెలిసి ఉన్న శివలింగానికి పూజచేయసాగాడు. ఒక్కొక్క దళమే తీసి లింగంమీద వేస్తూంటే సాలెపురుగు దాక్కుని ఉన్న ఆకుకూడా అతనిచేతికివచ్చి ఆ పురుగుకు శివుని దర్శనమైంది. పురుగు ఆకుతోబాటు తనుకూడా లింగంమీద పడిపోకుండా తప్పించుకుని, భక్తుడు వెళ్ళిపోయాక శివలింగాన్ని తనివితీరా చూడడం మొదలెట్టింది. "ఈమహాదేవుణ్ణి నిత్యం సేవించి,





తళ తళ మెరిసిపోయే పోగులుచేసి వాటితో గూళ్ళు కడుతుంది. మన సాలెపురుగు కూడా ఆ పోగులతోటే శివుడికి గుడీ గోపురం, ప్రాకారం ఎంతో నేర్పుగా కట్టేసింది. అవన్నీ ఎంత అందంగా ఉన్నాయనుకున్నారు! మర్నాడు పొద్దునే లేచి చూచేటప్పటికి, మంచు బిందువులు వాటి మీద పడి, ఆ గుడీ, గోపురం, ప్రాకారం కూడా తెల్లటి ముత్యాలతో కట్టారా అన్నట్టు కనపడినై. క్రమంగా ఎండవచ్చి సూర్య కిరణాలు వాటిమీద పడేటప్పటికి, అవన్నీ రంగు రంగులుగా మెరిసి నవరత్నాలతో కట్టినట్లు కనపడ్డాయి.

కాని ఒక చిక్కొచ్చింది. సాలెపురుగు పోగులతో కట్టిన గుడీ, గోపురం, ప్రాకారం అందంగా ఉన్నాయన్న మాటేగాని వాటిల్లో గట్టి ఎక్కడుంది? కాస్త గాలివేసేటప్పటికి ఆ పోగులు అక్కడక్కడ తెగిపోతూండేవి. ఆ తెగిపోయిన వాటిని అతుకు పెట్టడంతో ఆ సాలెపురుగుకు ప్రొద్దస్తమానం సరిపోయేది. ఐతేం? విసుగూ, విరామం లేకుండా అలా అది అతుకులు పెడుతూనే ఉండేది. శివుడంటే దానికున్న భక్తీ శ్రద్ధా అటువంటి వన్నమాట.

ఇలా కొంతకాలమయాక శివుడికి దాని భక్తిని పరీక్షిద్దామని బుద్ధిపుట్టింది.

సాలెపురుగును పత్రితోబాటు శివలింగం వద్దకు తెచ్చిన భక్తు డొకనాడు మామూలు ప్రకారం శివుడికి పూజచేసి, దీపంపెట్టి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళేక శివుడు తన ప్రభావంచేత ఆ దీపాన్ని పెద్దదయేటట్లు చేశాడు. మొదట ముత్యంలా ఉన్న దీపం సాలెపురుగు చూస్తూండగానే దివిటీలాగై పోయి, మరో నిముషానికి తాటి చెట్టంతై, సాలెపురుగు ఎన్ని సంవత్సరాల నుంచో శ్రమపడి కట్టిన గుడినీ, గోపురాన్నీ ప్రాకారంతో సహా తగులబెట్టి నాశనం చేసింది.





సాలెపురుగుకు దీపంమీద పట్టరాని కోపం వచ్చింది. "నేను పరమేశ్వరుని కోసం చేసిన ఈపని అంతా యీ విధంగా వృథా ఐపోయాక ఇంక నా బ్రతుకెందుకు? నాకూ, పరమేశ్వరుడికీ అకారణంగా ఇలా అపచారం చేసిన ఈ దీపం పని పడతాను. చస్తే చస్తాను; దీన్ని మింగేసి, నాకసి తీర్చుకుంటాను" అని నిశ్చయించుకుని, దీపాన్ని మింగటానికి గబగబా లింగంవద్దకు పరుగెత్తు కొచ్చింది.

శివు డాశ్చర్యపోయాడు. 'అబ్బా, ఈ సాలెపురుగుకి ఎంత భక్తి!'-అనుకున్నాడు. తక్షణమే శివుడు లింగంలోంచి ప్రత్యక్షమై, "అగు. అగు. దీపాన్ని మింగకు. నీ భక్తిని పరీక్ష చేద్దామని నేనే చేయించాను ఈపని. నీ భక్తికి మెచ్చుకున్నాను. నీకేం కావాలో వరం కోరుకో. ఇస్తాను" అన్నాడు.

ఈశ్వరుడలా ప్రత్యక్ష మయేటప్పటికి ఆ సాలెపురుగుకు కలిగిన సంతోషానికి అంతు లేకపోయింది. దానికి శివుణ్ణి స్తోత్రం చెయ్యటానికి శ్లోకాలూ మంత్రాలూ రావు కదా? అంచేత ఊహు భక్తిపొంగిపస్తూంటే అదేపనిగా స్వామికి మ్రొక్కటం మొద లెట్టింది.

వరం కోరుకోమన్నాడు గనుక, సాలెపురుగు జన్మపోయి, మంచిజన్మ ఏదైనా కోరుకోవచ్చు. డబ్బు, దస్కం ఇమ్మని కోరుకోవచ్చు. కాని ఆ సాలెపురుగు అలాంటి స్వల్పకోరిక లేమీ కోరలేదు.

"ఎంత గొప్పపుట్టుక పుట్టినా బాధలు తప్పవు. ఏ బాధాలేకుండా ఉండాలంటే జన్మ లేకుండా పోవాలి. కనుక నన్ను నీలో చేర్చుకో స్వామీ!" అని మనసారా కోరింది.

ఈశ్వరుడు దాని తెలివికీ జ్ఞానానికీ మెచ్చుకుని, తనలో ఐక్యం చేసుకుని మోక్షమిచ్చాడు. ఈవిధంగా కీటకముగా మారినప్పటికీ, ఊర్ణనాభుడు తరించాడు.






మరునాడు ధీరసింహుడు వెళ్ళగానే, అతనిని కూర్చోబెట్టి సులోచన తన రెండవ ప్రశ్న చెప్పనారంభించింది: "ఇక్కడికి పడమటిదిక్కున పదియోజనాల దూరంలో ఒక నది ప్రవహిస్తున్నది. అది ఎల్లప్పుడూ రక్తంవలె ఎర్రగా ఉంటుంది. అది ఎక్కడ పుట్టిందో, ఎర్రగా ఎందుకు ఉన్నదో, ఆ వివరాలన్నీ కావాలి" అని అనేవరకు, ధీరసింహుడు మళ్ళీ గడువు తీసుకొని, ఉత్సాహంతో బయల్దేరాడు.

అతను చాలాదూరం నడచివెళ్ళగా, రక్తనది కనిపించింది. ఆ నదిని చూచి అతనికి ఆశ్చర్యం వేసింది. నది గట్టునే ఎంతోదూరం నడవగా నడవగా ఒక భయంకరమైన అరణ్యం తగిలింది. అనేక భయోత్పాతాలు గడచి, ధీరసింహుడు ఎలా అయితేనేం, అరణ్యం చివరకు చేరుకొన్నాడు.

అక్కడ ఒక పర్వతంపైనుంచి రక్త నది ప్రవహించటం గమనించి, మెల్లగా ఆ కొండ యెక్కాడు. కొండశిఖరం చేరుకొనే వరకు, ఒక చిత్రమైన దృశ్యం కంటబడింది. ఒక పెద్ద కొలను, ఆ కొలను మధ్యని ఒక చెట్టు, ఆ చెట్టు కొమ్మలకు ఒక వంద స్త్రీ శిరస్సులు వేలాడుతున్నయి. అతను అమితాశ్చర్యంతో అక్కడనే కూర్చుని అటు చూస్తూవుండగా, ఆ శిరస్సులు ధీరసింహుణ్ణి చూచి పకపకా నవ్వసాగాయి.

ఇంతలో చీకటిపడింది. కాని, వెంటనే మాయవెలుతురు ఆ ప్రదేశమంతటా నిండి, పట్టపగలువలెనే ఉన్నది. చెట్టుకొమ్మల నుంచి వేలాడుతూవున్న శిరస్సులన్నీ ఒకటొకటిగా కొలనులోకి జారినై. చిటికసేపటిలో, ఆ శిరస్సులెన్ని ఉన్నాయో సరీగా అంతమంది స్త్రీలు కొలను గట్టు



మీదికి వచ్చారు. అంతమందిలోనూ ఒకామె మాత్రం చుక్కలలో చంద్రునికి మల్లే అపరూపసౌందర్యముతో ప్రకాశిస్తున్నది.

కొంచెంసేపట్లో, కొలువుతీర్చి కూర్చుని వున్న ఆ స్త్రీలను పరిచారికలు పంచభక్ష్య పరమాన్నములు పట్టుకవచ్చి వడ్డించారు. ఆస్త్రీలు ధీరసింహుణ్ణి తమ బంతికి పిలవగా, అతను వెళ్ళాడు. అందరూ కలసి ముచ్చటలు చెప్పుకొంటూ, సరదాగా భోజనాలు చేశారు. తరువాత వారు ధీరసింహుని చుట్టూ మూగి, తెల్లవారిందాకా నృత్యగీతాదులతో అతన్ని పరవశుని చేశారు తెల్లవారేసరికల్లా ఆ కన్యలందరూ మళ్లీ శిరస్సులుగా మారి, ఎప్పటివలె చెట్టు కొమ్మలను వేలాడసాగారు.

ఇంతగా తనను ఆదరించిన ఆ కన్యలు చెప్పకపోతారా అనే నమ్మకంతో, 'ఈ రక్తనది ఏమిటి? శిరస్సులేమిటి?' అని అతను వారిని ప్రశ్నించాడు. కాని వారు, ఎన్నిసార్లు అడిగినా, 'ఇదంతా మాయ' అనిమాత్రం చెప్పి ఊరుకొనేవారు. చీకటి పడగానే ఆ శిరస్సులు కన్యలుగా మారటం, ధీరసింహునికి విందుచేసి అతన్ని నృత్యగీతాదులతో తన్మయుణ్ణిగా చేయటం, తెల్లవారేసరికి కన్యలు మళ్ళీ శిరస్సులుగా మారిపోయి, చెట్టుకొమ్మలను వేలాడటం ఇలానే ప్రతీరోజూ జరుగుతూవున్నది. కాని ధీరసింహుడు ఎంత ప్రాధేయపడినా, వారు రహస్యంమాత్రం వెల్లడిచేయలేదు.

దీక్షాపరుడైన ధీరసింహుడు, ఈ రహస్యం ఎలా తెలుసుకోగలమా అని తీవ్రంగా ఆలోచించుకుంటూ, రాత్రీ పగలూ అనేక కొండలు దాటి పోతూ వుండగా, ఒక కొండగుహలో తపస్సులో వున్న ఋషీశ్వరుడు కనిపించాడు. తను వచ్చినపని ఈ మహానుభావునివల్ల నెరవేరి

15

తీరుతుందని ధీరసింహునికి మనస్సులో తట్టింది. మూడు రాత్రుళ్ళు, మూడు పగళ్ళు అతను అలానే కదలక కూర్చుండే వరకు, నాలుగోరోజున ఋషి కళ్ళు తెరచి ధీరసింహుని పలకరించాడు.

ధీరసింహుడు తన వృత్తాంతం అంతా చెప్పేసరికి, ఋషి అతనితో "ఓయి, ధీరసింహా! నీకు కనబడిన స్త్రీలలో అందరికంటే అందమైన కన్య, కమలాకరుడనే ఒక ఇంద్రజాలికుని కూతురు. యుక్త వయస్సులో ఆమె తనకు పెళ్ళి కావాలని కోరింది. కాని తండ్రికి ఇష్టంలేక, ఆమె పైన కోపించి ఈ మాయ నంతటినీ సృష్టించి, చెలికత్తెలతోసహా కూతురును బంధించివేశాడు. ఈ మాయను ఎవరైనా భేదించి, కమలాకరుణ్ణి చంపగలిగితే వాళ్ళకు ముక్తి ఉన్నది. లేకపోతే వారి గతి అంతే," అని చెప్పాడు.

ఇదివిని ధీరసింహుడు "మునీశ్వరా! తమదయ ఉంటే, నేను ఇంద్రజాలికుని చంపివేసి, ఆ స్త్రీలకు ముక్తిమార్గం చూపిస్తాను," అనేవరకు, ఋషి "అబ్బాయీ! ఇందుకు నీవు తగినవాడవని నాకు ముందే తెలుసు. నేను చెప్పబోయే మంత్రాన్ని




జపించినంత కాలమూ నీమీద ఏ మాయలూ పనిచేయవు. నీకు విజయమవుతుంది, వెళ్ళు" అంటూ, ఒక రహస్య మంత్రం ఉపదేశించాడు. మునీశ్వరునికి భక్తితో నమస్కరించి, ధీరసింహుడు రక్త నది ప్రవహించే పర్వతంవేపు పోసాగాడు.

కమలాకరుడు సృష్టించిన ఆ పర్వతమూ మాయపర్వతమే. దానిమీద చెట్లు మున్నూట అరవై రోజులూ పచ్చగానే ఉంటాయి, పూలచెట్లు ఏటి ఏడాదీ పూస్తూనే వుంటాయి. ధీరసింహుడు కొండ మీదకు పోయేసరికల్లా మాయ పులులూ, మాయసింహాలూ గాండ్రు పెడుతూవచ్చి



అతని పైనబడి మింగబోయినై. ఆ మాయ పర్వతంమీద నించున్న ధీరసింహుని కాళ్ళు సూదంటురాయికివలె అంటుకు పోయి, నేలనుంచి ఊడిరాలేదు. అప్పుడు ధీరసింహుడు గురువును తలచుకొని ఒక్క సారి మంత్రం జపించేవరకు, ఎక్కడి జంతువులు అక్కడనే అదృశ్యమైపోయినై. అతని కాళ్ళు నేలమీదినుంచి ఊడివచ్చి, మామూలుగా నడవగలిగాడు.

కమలాకరుడు తన మాయకోటలో కూర్చుని, పుస్తకం తెరచి చూచేటప్పటికి, తను సృష్టించిన మాయను భేదించటానికి ధీరసింహుడు వస్తున్నాడని తెలిసింది. వెంటనే అతను, సరిగా తన కుమార్తెను పోలిన ఒక మాయస్త్రీని సృష్టించి, చెలికత్తెలతో సహా ధీరసింహునివద్దకు పంపాడు. అక్కడ వాళ్ళు అనేకవిధాల నాట్యంచేసే వరకు, అతను 'ఇదేమిటి! ఇప్పుడు చెట్టు మీద కనిపించిన ఈ కన్యలందరూ అప్పుడే ఇక్కడకు ఎలా వచ్చారు!' అని ఆశ్చర్యపోయాడు.

ఆ మాయకన్యలు వారి నాట్యంతో ధీరసింహుణ్ణి ఆకర్షించి, అతను సంతోషంగా ఉన్న సమయంచూచి అతనిచేత రకరకాల పానీయాలూ తాగించి, అతను మత్తులో ఉండగా బంధించి కమలాకరుని వద్దకు తీసుకపోయారు.

పూర్వకాలంలో హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధలు పెట్టినట్టుగా, ధీరసింహునికి కమలాకరుడు అనేక కష్టాలను కలగజేశాడు. జ్వాలలు ఎగసివచ్చే మంటలలో పడవేయించాడు. ఎత్తయిన పర్వతం మీదినించి కిందికి దొర్లించాడు. ధీరసింహుడు గురువును తలుచుకొని మంత్రం జపించటంవల్ల మంటలలో పడవేసినా ఒళ్ళు కాలలేదు. కొండమీదినించి దొర్లించినా కొంచెంకూడా దెబ్బ తగలలేదు.

17

చేసేది లేక, కమలాకరుడు అతనిని బందిఖానాలో పెట్టివుంచాడు. బుద్ధిశాలి అయిన ధీరసింహుడు, సుధాకరుడనే కాపలావాణ్ణి వశపరుచుకొని, "ఓయి అబ్బాయీ! నన్ను చెరవిడిపించినావంటే, కమలాకరుణ్ణి సంహరించి నిన్ను అతని రాజ్యానికి పట్టం కడతాను" అనేవరకు, ధీరసింహుని ప్రజ్ఞ ఇదివరకే తెలిసికొని వున్న సుధాకరుడు అతనిని ఖైదునించి తప్పించివేశాడు.



తెల్లవారేసరికి ధీరసింహుడు జైలులో నుంచి తప్పిపోయిన వార్త ఊరంతా వ్యాపించి, కమలాకరుని చెవినిపడింది. వెంటనే ఆయన పుస్తకం తెరచిచూచి, ముందు జరుగబోయేదంతా తెలుసుకొని, ధీరసింహుణ్ణి పట్టి తీసుకరమ్మని ఆజ్ఞాపించాడు.

ఈ సంగతి తెలిసి, సుధాకరుడు తక్షణమే పోయి ధీరసింహుని శరణుజొచ్చాడు. ధీరసింహుడు అతనితో "నీకు వచ్చిన భయంలేదు" అని ధైర్యంచెప్పి, కమలాకరుని నివాసమును గురించిన రహస్యాలు అడిగేవరకు, అతను ఇలా చెప్పాడు:

"కమలాకరుడు నాస్తికుడు. క్రూరుడు. అసాధ్యుడు. అతను ఉండటానికి ఈ మాయ కోటమాత్రమే గాక, ఈశ్వరుణ్ణి జయించటానికి ముఫ్ఫయివేల అడుగుల ఎత్తున ఒక మాయ ఆకాశం నిర్మించి, అందులో సూర్య చంద్రుల్నీ, నవగ్రహాలనూ సృష్టించాడు. శత్రువు తనపైకి దాడి వచ్చినప్పుడు, ఇంద్రజిత్తు మోస్తరుగా, కోట వదలి మాయ ఆకాశంలోకి పోయి దాగుంటాడు. కనుక అతన్ని జయించటం ఎవరికీ సాధ్యం కావటంలేదు" అని.

ఇది విని ధీరసింహుడు "సుధాకరా! దైవాన్ని నమ్మినవాళ్ళకు అసాధ్యమనేది



18



లేదు. అతని కోటకు దారి చూపించు. తరువాత సంగతి చెబుతాను" అంటూ, సుధాకరుణ్ణి వెంటబెట్టుకొని అతను బయల్దేరాడు. దోవలో చిత్రమైన చెట్లు ఎన్నో కనిపించినై. వాటిని గురించి ధీరసింహుడు అడిగేవరకు, "ఇవి నిజమైన చెట్లు కావు. కమలాకరుని మాయవల్ల మనుషులే ఇలా మారిపోయారు" అని సుధాకరుడు చెప్పాడు.

గురువును తలుచుకుని, ధీరసింహుడు ఒక్కసారి మంత్ర జపించగానే, ఆ చెట్లన్నీ మళ్ళీ మనుష్యులుగా మారిపోయి, ధీరసింహుని వెంట బయల్దేరారు.

ధీరసింహుడు తనమీదికి వస్తున్నాడని తెలుసుకొని, కమలాకరుడు యుద్ధం చేయటానికి సిద్ధపడి అప్పటి కప్పుడే కొత్త కొత్త మాయలు ప్రారంభించాడు. అతని మాయలకు భూమి కంపించసాగింది. కటికచీకటి అలుముకొన్నది. అందుచేత ధీరసింహుని వెంటనున్న పరివారమంతా భయపడి కేకలు పెట్టారు. ధీరసింహుడు గురువును తలచుకొని మంత్రం జపించేవరకు, చీకటి విచ్చిపోయి మళ్ళీ వెలుగువచ్చేసింది, భూమి కపించటం మానివేసింది.

కోపం కొద్దీ కమలాకరుడు అగ్నేయాస్త్రం వేసి, ఎగసివచ్చే మంటలను పంపించాడు. ధీరసింహుడు వారుణాస్త్రం ప్రయోగించి వర్షం కురిపించి, ఆ మంటలను ఒక్క క్షణంలో చల్లార్చాడు. అప్పుడు కమలాకరుడు ఒక పెద్ద మాయపర్వతాన్ని ధీరసింహుని మీదకు వదిలాడు. అది తనను తాకకముందే ధీరసింహుడు తీవ్రంగా జపించేవరకు, మంత్ర మహిమవల్ల ఆ పర్వతం వెంటనే తిరిగిపోయి కమలాకరుని సేననే హతమార్చించి. కమలాకరుడు మాత్రం కాస్తంతలో చావుతప్పి, బతికాడు. చివరకు కసికొద్దీ కమలాకరుడు మాయ



సర్పాలను వదిలిపెట్టాడు. ధీరసింహుడు గురువును తలచుకొని గాఢమైన గారుడాస్త్రం ప్రయోగించేవరకు, ఆ మాయ సర్పాలన్నీ ఎదురుతిరిగి, కమలాకరుని సైన్యాన్నే కాటువేయ జొచ్చినై.

ఇక ధైర్యం చాలక, కమలాకరుడు తన మంత్రశక్తివల్ల అదృశ్యమై పోయాడు. ఇది చూచి, మిగిలివున్న సైన్యమంతా ధీరసింహుని పక్షం చేరిపోయింది.




కమలాకరుడు తన మాయ ఆకాశంలో దాగివుంటాడని గ్రహించి, ధీరసింహుడు దీక్షతో జపించేవరకు, ఆ ప్రభావంవల్ల మాయ ఆకాశం ఫెళఫెళమంటూ విరిగి ఒక్కసారిగా కూలిపోయింది. కమలాకరుడూ, కొద్దో గొప్పో మిగిలిన ఆతని సైన్యం దాని కిందపడి చచ్చారు.

ధీరసింహుడు అనుచరులతోపాటు ఆనందంగా కోటలో ప్రవేశించేవరకు, అక్కడ ఎన్నో దివ్యమైన బంగారపు మేడలూ, అందమైన పూలతోటలూ కనపడినై. పోతే, అక్కడ ఉండే బజారులో దొరకని వస్తువంటూ లేదు. ఆదేం చిత్రమో గాని, ఆ వస్తువులు అమ్మడానికి మనుషులెవరూ కనిపించరు. ధీరసింహుని అనుచరులకు ఆకలి దహించుకుపోవటంచేత, కంటికి నిండుగా కనపడిన మిఠాయి దుకాణాలమీదికి వారు ఎగబడ్డారు. కాని, కొంచెంసేపటికే వాళ్ళందరూ గిరగిర ఒళ్ళు తిరిగి కింద పడిపోయారు.

వీరి స్థితిచూచి ధీరసింహుడు "ఓహో, ఈ మిఠాయి తిన్నందువల్లనే వీరు పడిపోయివుండాలి. ఇది బహుశా మాయ మిఠాయి కాబోలు!" అని తలచి, దగ్గరనే వున్న ఒక కొలనులోని నీళ్ళుతెచ్చి, మంత్రించి ఆ మంత్రజలం వారిపైన చల్లేవరకు, అందరకూ తెలివివచ్చింది. కల కాని లేచినట్టుగా, అందరూ గభీమని లేచి

కూర్చున్నారు. ధీరసింహుడు మంత్రజలం చల్లిన తరువాత ఆ ప్రదేశమంతా పవిత్రమై, కమలాకరుని మాయలు మచ్చుకైనా లేకుండా పోయినై. ధీరసింహుడు వాగ్దానం ప్రకారం సుధాకరునికి పట్టం కట్టాడు.

తరువాత, పర్వతం సమీపాన కొలను వద్దకు వెళ్లి, ఆ కన్యల శిరస్సులు వేలాడుతున్న చెట్టు చేరుకొన్నాడు. అక్కడ కూర్చుని, కొంతసేపు మంత్రం జపించే వరకు, సరోవరమూ లేదు, వృక్షమూ లేదు. కన్యలు మాత్రం ధీరసింహుని ముందు నిల్చుని వున్నారు.

అతను కమలాకరుని కూతురుతో "అమ్మాయీ! నీ తండ్రి చాలా దుర్మార్గుడు. నిన్నేగాకుండా నిరపరాధులైన ఎంతో మందిని అకారణంగా హింసించాడు. కనుక, అతన్ని చంపవలసి వచ్చింది. నీ కష్టాలు గట్టెక్కినై. నీ యిష్టం వచ్చిన వానిని వివాహం చేసుకొని సుఖంగా ఉండు" అని చెప్పి, వారినందరినీ కోటకు చేర్చాడు. ఇంద్రజాలికుని కూతురు సుధాకరుణ్ణే వరించి పెళ్లాడి, సుఖంగా ఉన్నది. అప్పటినించీ ఆ నదిలోని నీరు నీటికిమల్లే స్వచ్ఛంగా ఉంటూవుంది.

ధీరసింహుడు తనకు మంత్రం ఉపదేశించిన గురువువద్ద సెలవు తీసుకొని, సులోచన ఉండే నగరానికి బయల్దేరాడు. అతను వచ్చినట్టు తెలియగానే సులోచన రెండు కుర్చీలు వేయించి, ధీరసింహుణ్ణి ఎంతో గౌరవించింది. అతను సావకాశంగా తను చూచివచ్చిన వృత్తాంతం అంతా చెప్పగా, ఆమె సంతోషించి, "అవును. ఇప్పుడు ఆ నదిలో నీరు ఎర్రగా కాకుండా, నిర్మలంగా ఉన్నట్టు తెలిసిందికూడాను. నీవు చెప్పినవన్నీ యదార్థములే" అని ఒప్పుకొని, "రేపటిరోజున మూడవప్రశ్న చెబుతాను" అని చెప్పి ధీరసింహుణ్ణి సాగనంపింది. (ఇంకా వుంది)






అనగనగా కాంచనపురి అనే దేశాన్ని రత్నసింహుడు అనే రాజు పరిపాలిస్తూ ేవాడు. చాలా కాలంవరకు అ సంతానం కలగలేదు.

ఒకనాడు రాజుకి కలలో ఒక దేవకన్య కనిపించి యిలాచెప్పింది "రాజా! మరో సంవత్సరానికల్లా రాణికి ఆడ శిశువు కలుగుతుంది. ఆ శిశువుకు 'రోజాసుందరి' అని పేరుపెట్టు. ఆమె నవ్వినప్పుడల్లా నోటి వెంట రోజాలు పడతై. ఇక ఆమెరా తి కన్నీటిచుక్కా ఒక ముత్యం అవుతు .

సంవత్సరం గడువు తీరి ఒక సుముహూర్తాన రాణి ఒక ఆడ శిశువును కన్నది. దేవకన్య చెప్పినట్లుగానే ఆ శిశువు నవ్వినప్పుడల్లా రోజా పువ్వులు రాలేవి. ఏడ్చినప్పుడు కన్నీటి బొట్లు నేలమీద పడటం తోటే అవి ముత్యాలుగా మారిపోయేవి. శిశువుకు రోజాసుందరి అని పేరుపెట్టారు.

క్రమంగా రోజులుగడిచి రోజాసుందరికి యుక్తవయస్సు రాగానే ఆమెకి తగిన వరునికోసం రాజు ఒక చక్కటి ఉపాయం ఆలోచించాడు. "ఏ రాజకుమారుడైతే నాకుమార్తెకు ఒక చక్కటి కథ చెప్పి ఆ కథవల్ల ఆమెను నవ్వించి, ఏడ్పించగలడో అతనికి నా కుమార్తెనుయిచ్చి వివాహం చేస్తాను" అని రాజు చాటింపించాడు.

ఈ చాటింపు విని దేశదేశాలనించి ఎంతో మంది రాజకుమారులు వచ్చారు. రాజకుమారులు ఒక్కొక్కరే వచ్చి ఒక్కో కథ చెప్పసాగారు. కాని నవ్వించి ఏడ్పించే కథ చెప్పటం ఎవరివల్లా కాలేదు. చివరకు పాంచాలరాజ కుమారుడు ఒక కథ చెప్పటం ప్రారంభించాడు. కథ పూర్తిఅయ్యే లోపల రోజాసుందరి చాలసార్లు కన్నీరు కార్చటం, నవ్వటంకూడా జరిగేసరికి రాజు పాంచాల రాజుకుమారుడే తనకుమార్తెకు

డి. స్వర్ణలత, భీమవరం.



అయిపోయి, ఎలాగైనా రోజాసుందరిని వెళ్ళగొట్టి ఆమెకి బదులుగా తన అన్న కూతురును రప్పించుకోవాలెనని ఆత్రం కలిగింది. ఆమెకు ఒక ఆలోచన తోచింది. తన అన్నకూతురికీ, రోజాసుందరికీ చాల దగ్గిర పోలికకూడా వుంది. వాళ్ళిద్దర్నీ ఒకరి ప్రక్కన ఒకరిని నిలబెడితే అందులో ఎవరు రోజాసుందరి అయినదీ కనుక్కోటం చాలా కష్టం. ఇంత దగ్గరి పోలిక వున్న సంగతి గ్రహించి ఆమె ఒక వుపాయం ఆలోచించి సమయంకోసం వేచివుంది.

తగిన భర్త అని నిర్ణయించి ఆ మర్నాడే వారిద్దరికీ వైభవంగా వివాహం చేశాడు.

ఒకవారం గడిచిన తర్వాత పాంచాల రాజుకుమారుడు, రోజాసుందరిని తీసుకుని తనరాజ్యం తిరిగి చేరుకున్నాడు. పాంచాల రాజు, తన కుమారుడు తగిన భార్యని సంపాదించి తెచ్చుకున్నందుకు చాల సంతోషించాడు. కాని, రాణిమాత్రం సంతోషించలేదు. ఎందువల్లనంటే ఆమె అన్న కుమార్తెను తనకుమారునికి చేసుకోవలెనని మొదటినించీ అనుకుంటూ వున్నది. కాని యిప్పుడు తనకొడుకు రోజాసుందరిని పెళ్ళి చేసుకోవటంతో ఆమె అగ్గి బుగ్గి

ఇలా వుండగా పాంచాలరాజకుమారుడు ఒక పొరుగురాజ్యం వెళ్ళాడు. ఈ అవకాశం తీసుకుని రాణి తన అన్న కూతురును రప్పించుకుంది. తమ ఆస్థాన వైద్యుడికి గొప్ప బహుమతి యిచ్చి అతని సహాయంతో ఒకరోజు రాత్రి రోజాసుందరికి మత్తుమందుపెట్టి ఆమె రెండుకళ్లనూ పీకించింది. తన అన్నకూతురు కళ్ళను కూడా పీకించి వాటికి బదులు రోజాసుందరి కళ్లు ఆ పిల్లకు పెట్టించింది. ఆ రాత్రికి రాత్రే ఆ వైద్యుడి ద్వారా రోజాసుందరిని ఒక దూర ప్రదేశానికి తీసుకుపోయి వదలి రమ్మని పంపించివేసింది.

ఆ ఆస్థానవైద్యుడు రోజాసుందరిని గుడ్డిదాన్నిచేసి, ఆమెను ఒక పాడు పడిన బావిలో పడేసి వచ్చాడు. ఈ పనిని యింత ధైర్యంతో నెరవేర్చి తనకు సహాయ పడినందుకు రాణి ఆస్థాన వైద్యుడికి మరిన్ని బహుమతులిచ్చి ఈ విషయం బైటికిపొక్కకుండా కట్టుదిట్టంచేసి నిశ్చింతగా వున్నది.

ఇంతలో పాంచాల రాజకుమారుడు తిరిగి వచ్చాడు. అతను ఎక్కడ అనుమానపడిపోతాడోనని, రాణి అన్నకూతురు ఆతను యింట్లో అడుగు పెడుతూవుండగానే ఎదురువెళ్ళి, అతని కాళ్ళపైన పడి "యిన్నాళ్ళు నన్ను వదలివుంటారా? ఇక్కడ నన్ను వదిలేసి మీదారిన మీరు పోతే నాకు ఏమీ తోచలేదు" అంటూ లేని ఏడుపు తెప్పించుకుంది. ఆమె అలా ఏడవగానే ఆ కన్నీటిచుక్కలు ముత్యాలుగా మారినై కనుక రాజకుమారుడు తన ఎదటవున్నది తన రోజాసుందరే అని నమ్మి ఆమెను ఎంతో ఓదార్చాడు.

కాని రాజకుమారుడు ఆదివరకులాగా ఈమెను నవ్వించలేక పోతున్నాడు. అంతకుముందు ఏమాత్రం నవ్వు వచ్చేసంగతి విన్నా పక పక నవ్వే తనభార్య యిప్పుడు



ఎంతో నవ్వుతెప్పించే సంగతులు చెప్పినా నవ్వటంలేదు. ఆమె కళ్ళు రోజాసుందరివి కాజేసి పెట్టుకున్నవి కనుక కన్నీరు చాల్ప గలిగి ముత్యాలుగా మార్చకలిగింది కాని ఆమె నవ్వితే రోజాలు రాలుతయ్యా. రాలవని ఆమెకూ తెలుసు. అందువల్లనే ఆమె ఎంతనవ్వువచ్చినా బలవంతాన ఆపుకునేది.

ఇది యిలా వుండగా అక్కడ రోజాసుందరి పడివున్న బావి ప్రక్కగా ఒక పల్లెవాడు పోతూ బావిలోంచి వస్తున్న మూలుగు విని రోజాసుందరిని బైటికి తీసి తన యింటికి తీసుకపోయాడు. రోజాసుందరికి తెలివి వచ్చిన తర్వాత




"ఎవరమ్మా నువ్వు? ఇంత అందమైన నిన్ను దేవుడు యిలా గుడ్డిదాన్ని చేశాడేమిటి? పాపం దారితెలియక బావిలో పడ్డావనుకుంటాను. నీవెవరోచెప్పు. నాచేతనైన సహాయం చేస్తాను" అన్నాడు. కాని, రోజాసుందరి తన నిజమైన సంగతి చెప్పక "నన్ను కొంతకాలంపాటు నీ యింట్లో వుంచుకుంటే నాకదే పదివేలు. ఇంతకంటే నాకు ఏ సహాయమూ అక్కర్లేదు" అన్నది. పల్లెవాడు సరేనని ఆమెను తన వద్దనే వుంచుకుని కాపాడుతున్నాడు.

ఒక రోజున పాంచాల రాజకుమారుడు అడవిలో వేటాడుతూ ఒక లేడిని బాణంతో కొట్టాడు. లేడి వెంటనే చనిపోయింది. ఇక్కడ లేడి ఎప్పుడైతే చనిపోయిందో పల్లెవాడింట్లో వున్న రోజాసుందరి కూడా హఠాత్తుగా చనిపోయింది. పల్లెవాడు చాలా విచారించి, ఆమెను సమాధి చేశాడు.

రాజకుమారుడు ఆ లేడిని తీసుకుపోయి వండించి తనూ తనభార్య తిన్నారు. ఈ లేడి మాంసం తిన్న మరో సంవత్సరానికల్లా పాంచాల రాజకుమారుని భార్య ఒక చక్కని ఆడ శిశువును కన్నది. ఆ బిడ్డ కూడా రోజాసుందరి లాగానే నవ్వినప్పుడు రోజాలు రాలుస్తూ, ఏడ్చినప్పుడల్లా ముత్యాలు కురిపించటం చూచేసరికి అతనికి అదివరకు తన భార్యపైన వున్న అనుమానం కాస్తా తొలిగిపోయింది.

కాని ఒకరోజు రాత్రి అతనికి కలలో దేవకన్యలు కనిపించి యిలా చెప్పారు. "ఓ రాజా! ఇప్పుడు నీవు ఎవరినైతే నీ భార్య అనుకుంటున్నావో ఆమె నీ నిజమైన రోజాసుందరి కాదు. నీవు ఆరోజున అడవిలో లేడిని ఎప్పుడైతే చంపావో అప్పుడే నీ రోజాసుందరి చనిపోయి యిక్కడికి పది ఆమడ దూరాన ఒకచోట సమాధి చేయబడింది. ఇప్పుడు ఆ సమాధిపైన ఒక



చక్కని రోజాచెట్టు మొలిచింది. దాని కొమ్మలకు రోజాలతోపాటు ముత్యాలు కూడా వుంటై. ఆ సమాధికి ఆగ్నేయ మూలగా కొంతదూరం పోతే ఒక సరస్సు కనిపిస్తుంది. ఆ సరస్సులోని నీరు, నీకు పుట్టిన ఈ కొమార్తె చేత ఆ చెట్టు మీద చల్లించావంటే నీ రోజాసుందరి మళ్ళీ బ్రతికి వస్తుంది. కాని ఆమె బ్రతికినా, గుడ్డిదిగానే వుంటుంది. ఆమెకి మళ్ళీ చూపు కలిగించాలంటే యిప్పుడు నీ భార్యకి వున్న కళ్ళు పీకించి ఆమెకి అమర్చించు. ఇలా చేశావంటే నీ నిజమైన రోజాసుందరి నీకు తిరిగి లభిస్తుంది."

తెల్లవారింది. రాజకుమారుడు తనకు దేవకన్య కలలో కనిపించి చెప్పినది నిజమో అబద్ధమో తెల్చుకుందామని తనకుమార్తెను తీసుకుని బయలుదేరాడు. చివరకు సమాధి చేరుకునేసరికి అక్కడ దేవకన్యలు చెప్పినట్టుగా రోజాచెట్టూ, దాని కొమ్మలకు ముత్యాలూ కనిపించినై. తర్వాత సరస్సు వెతుక్కుంటూ పోయి అందులో నీళ్ళు తనకుమార్తెచేత దోసిటతో పట్టించి తిరిగి చెట్టువద్దకు వచ్చి దానిమీద చల్లించాడు. నీళ్ళు చెట్టుమీద పడటంతోటే సమాధి మాయమై దానిస్థానే రోజాసుందరి చెక్కు చెదరకుండా నిలబడింది. అతను చాల సంతోషించి ఆమెని తీసుకుని తన భవనానికి వచ్చాడు. వెంటనే తనను అప్పటి వరకూ మోసంచేస్తూ వచ్చిన తన తల్లినీ భార్యనీ పిలిపించాడు. అస్థాన వైద్యుణ్ణి కూడా రప్పించి రోజాసుందరికి తిరిగి ఆమె కళ్ళు ఏర్పాటుచేయించాడు. అంతేగాక తల్లికీ, ఆమెకు సహాయపడిన ఆ ఆస్థాన వైద్యుడికీ యావజ్జీవ ఖైదు విధించాడు.

నాటినించీ పాంచాల రాజకుమారుడు రోజాసుందరితోనూ, తమ చిన్న రోజా కుమారితోనూ హాయిగా వుంటున్నాడు.

# స్వర్గంలో



పూర్వకాలమందు పర్షియా దేశంలో జొరొస్టర్ అనె మతబోధకుడు ఉండేవాడు. ఆయన ప్రేమమూర్తి. ఆయనకు ప్రపంచమంతటా శిష్యులున్నారు. జొరొస్టర్, తోడి మానవులందెగాక, నోరులేని మూగి జంతువులయందుకూడా ఎంతో దయగా ఉండేవాడు. ఆయన అలా ఉండటమే కాదు. శిష్యులందరకూ "ప్రపంచంలో ప్రతి ప్రాణినీ పరమదయాళువు అయిన ఆ పరమాత్ముడే సృష్టించాడు. కనుక, ముఖ్యంగా నోరులేని జీవాలను అతి ఆదరంతో చూచుకొవటం మానవుని విధి" అని బోధచేసేవాడు.

కరుణానిధి అయిన ఇటువంటి జొరోస్టర్‌కు ఒకనాడు ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దేవకన్య వచ్చి, ఆయనను స్వర్గంలోకీ నరకంలోకీ తీసుకపోయి, అక్కడి వింతలన్నీ చూపించింది.

జొరోస్టరూ దేవకన్యా కలసి ముందుగా నరకలోకం చూడబోయారు. అక్కడ ఎన్నెన్నో పాపాలుచేసిన దుర్మార్గులు రకరకాల శిక్షలను అనుభవిస్తున్నారు. వారు పడుతున్న యాతనలు చూడటం కష్టమనిపించింది జొరోస్టర్‌కు. అందరనూ చూచుకుంటూ, వారు చివరకు ఒక వ్యక్తివద్దకు వచ్చారు. ఈ మనిషికి ఒక కాలు లేదు. ఇతనిని గుర్తుంచుకొనమని దేవకన్య జొరోస్టర్‌తో అన్నది.

తరువాత వారు బయల్దేరి స్వర్గలోకం చేరుకొన్నారు. ఇక్కడకు ఎంతెంతో పుణ్యకార్యాలు చేసినవారంతా వచ్చి, కోరిన సౌఖ్యాలు అనుభవించి, ఆనందిస్తూ వున్నారు.

ప్రశాంతమైన వీరి జీవితవిధానంచూచి జొరోస్టర్‌కూడా ఆనందించాడు. ఈ సుఖ

పి. రంగాచారి, గుంతకల్లు

విచిత్ర

# ఒక చిత్రం



జీవులు అనుభవించే రకరకాల సౌఖ్యాలు అన్నీ చూడటం పూర్తిఅయిన తరువాత, చివరకు వారు ఒక విశాలమైన హాలులోకి వచ్చారు.

ఆ హాలులో ఒక నవరత్నఖచితమైన దివ్య సింహాసనం, దానిమీద ఒక కాలు జొరోస్టర్ కంటబడేసరికి "ఇటువంటి సింహాసనంమీద ఎవరో ప్రభువులూ, చక్రవర్తులూ కూర్చుని దర్బారుచేస్తారుగాని, ఇదేమి చిత్రం! మానవుని కాలు ఒక్కటి మాత్రమే దీనిపైన ఉండటమేమిటి! పైగా, దేముణ్ణి కొల్చినట్టుగా ఇక్కడి ప్రజలందరూ వచ్చి ఆ కాలిని గౌరవించిపోవడమేమిటి?" అని జొరోస్టర్ ఆశ్చర్యంతో దేవకన్యను అడిగాడు.

ఇందుకు బదులుగా దేవకన్య ఆ కాలిని గురించిన చిత్రం ఈవిధంగా చెప్పనారంభించింది—

"ఓయి మహానుభావా! చాలకాలంక్రితం ఒకప్పుడు ఒక దేశాన్ని పాలిస్తూ ఒకానొక రాజు ఉండేవాడు. ఆ రాజుకు, ప్రాణంతో వున్న మనుష్యులనూ, జంతువులనూ హింసించడం ఒక వినోదంగా ఉండేది. ఈవిధంగా ప్రాణికోటి నంతటినీ హింసించేవరకు, మనుష్యులకూ జంతువులకూ కూడా ఆ రాజంటే పరమ అసహ్యం కలిగింది. ఆయన క్రూరంగా ఉండటం చేత, రాజుపేరు చెబితే, ఎప్పుడు ఎవరిని ఏమిచేసిపోతాడోనని అందరకూ హడలుగా వుండేది. అంతులేని ఇటువంటి క్రౌర్యం వల్ల ఆ రాజ్యం క్రమంగా నాశనం కాజొచ్చింది.

" కానైతే ఇంతటి క్రూరుడైనా ఆ రాజు జీవితంలో ఒకే ఒక్క మంచి కార్యం చేశాడు. అది యేమిటీ అంటే ఒకరోజున



ఆయన ఎడారిలోనించి పోతూవుండగా, ఒక ఒంటె కనబడింది. దానిని ఒక రాటకు కట్టివేశారు. దాని మేత అల్లంత దూరాన తొట్టెలో ఉండటంచేత, పాపం, అది తిందామంటే ఆహారం నోటికి అందడం లేదు. ఆ తొట్టె అందుకుందామని ఆ ఒంటె ఎన్నోవిధాల ప్రయత్నించింది, కాని దాని ప్రయత్నాలు ఫలించలేదు. ఒంటె పడుతూవున్న అవస్థ చూసి రాజు పకపక నవ్వసాగాడు. ఏ కళనున్నాడో గాని, ఆయన వినోదంగా, ఆ తొట్టెను కాలితో ఒక్క తాపు తన్ని తిరిగి తన దారిన తాను వెళ్లిపోయాడు. నిజానికి ఆ ఒంటెకు ఉపకారం చేదామనే వుద్దేశం రాజుకు ఏకోశానా లేదు. అయినా, దాని అదృష్టం కొద్దీ, ఆ తన్నుతో తొట్టె ఒంటె చేరువకు పోయి, దాని నోటికి ఆహారం సరీగా అందింది.

"ఇప్పుడు అనేక దుర్మార్గులు చేయటం వల్ల పాపాత్ముడైన ఆ రాజు కళేబరం నరకలోకానికి పోయి, పాపాలకు తగిన యాతనలు అనుభవిస్తున్నది. పోతే తెలిసి తాకినా, తెలియక తాకినా నిప్పు కాలుతుందన్నట్టుగా, ఉద్దేశం లేక వినోదార్థమే అయినా, రాజు కాలు కొద్దిపాటి పుణ్యమే చేసుకొనటంవల్ల, పుణ్యం చేసికొన్న ఆ కాలు స్వర్గలోకంలో సింహాసనం అలంకరించి, అందరిచేతా గౌరవింపబడుతున్నది" అని చెప్పింది.

దేవకన్య ఈకథ చెప్పి ముగించగానే జొరోస్టర్‌కు మెలకువ వచ్చింది. అప్పటినించీ, పుణ్యపాపాలను గురించిన ఈ చిత్రకథ ఆయన శిష్యులందరకూ చెప్పి, "మూగి జీవాలయందుకూడా దయకలిగి ఉండండి. పుణ్యం వస్తుంది" అంటూ బోధించసాగాడు.






పూర్వకాలమందు నాగన్న అనే చెప్పులు కుట్టేవాడు ఒకడు ఉండేవాడు. వాడు పుట్టుపేద, కాని న్యాయవంతుడు. మంచి పనివాడు. నాగన్న చేతితో ఒక చెప్పులజత కుట్టి ఇచ్చినా, అతను ఒకజోడు మరమ్మతు చేసి ఇచ్చినా, అది ఏళ్ళతరబడి చెక్కుచెదరకుండా ఉండేది.

అయితే, ఇంత నాణ్యంగా జోళ్ళు తయారుచేయుటంవల్ల అతనికి మంచిపేరు వచ్చిందికాని, జీవనానికిమాత్రం లోపం కలిగింది. ఏమీ అంటే, ఒకసారి నాగన్న వద్ద కొన్న జోడు తరతరాలు మన్నుతూ వుండటంచేత, మళ్ళీ ఎవళ్ళూ కొనవలసిన అవసరంలేకపోయేది. అతను తయారు చేసిన జోళ్ళు అమ్ముడుపోక నిలవ ఉండిపోవటంవల్ల వ్యాపారం జరిగేదికాదు. కనుక, చేతిలో డబ్బు ఆడక, అతనికి జీవనం గడువటం కష్టమైపోయింది.

'ఏమిటా దారి దేముడా!' అని ఒకనాడు నాగన్న విచారిస్తూవుండగా, అతని కొట్టులోకి ఒక పొట్టిమనిషి మరమ్మతుకోసమని ఒకజోడు పట్టుకవచ్చాడు. ఎవ్వడైనా కొట్టులోకి వస్తాడా, ఒక కానీడబ్బు దొరుకుతుందా అని ఆత్రంతో కనిపెట్టుకొనివున్న నాగన్న నిమిషంలో ఆ జోడు చక్కగా బాగుచేసి ఇచ్చాడు.

పొట్టివాడు చాలా సంతోషించి, పావుకోళ్ల ఆకారంగావున్న ఒక చెప్పులజత నాగన్నకు బహుమతిచేసి, "కోటి రూపాయలు యిచ్చినా నువ్వు వీటినిమాత్రం ఎవళ్ళకూ అమ్మవద్దుసుమా!" అని హెచ్చరించి తనదారిన వెళ్ళిపోయాడు.

అతని సలహాప్రకారం నాగన్న ఆ పావుకోళ్ళను కిటికీలో అందరకూ కనపడేటట్టు చక్కగా అమర్చాడు. అలా అమర్చిన క్షణమునుంచీ నాగన్న కొట్టుకి జనం పట్టు

డి. సుశీలారాణి, అలహాబాద్



కుండా వచ్చి, జోళ్ళు కొనుక్కుపోతూ వచ్చారు. ఇదంతా ఆ పావుకోళ్ళ మహిమే కదా అని గ్రహించి, నాగన్న చాల సంతోషించాడు.

ఇప్పుడు నాగన్నకు పుష్కలంగా వ్యాపారం జరిగి, జీవితం సుఖంగా సాగి పోతూవున్నది. క్రమంగా నాగన్న వ్యాపారం బాగా పెరిగింది. తన ఒక్కడివల్లా కాక, అతను తనకింద మరి ముగ్గురు పనివాళ్లను పెట్టుకోవలసివచ్చింది.

జీవితంలో ఇంత మార్పువచ్చినా, నాగన్న, తనకు ఇంత అదృష్టం తెచ్చిన ఆ పావుకోళ్ళను మాత్రం అమ్మక వాటిని దేవుణ్ణి కొల్చినట్టు కొలుస్తూ, ప్రాణప్రదంగా చూచుకొంటూ ఉండేవాడు.

ఇలా ఉండగా, ఒకరోజున రాజుగారూ వారి కొమార్తె కలసి గుర్రపుసారటులో నాగన్న కొట్టుముందరగా వెడుతూవుండగా రాజకుమారి ఆ పావుకోళ్ళను చూసి అవి కావాలని కోరింది. రాజు సారటుదిగివచ్చి "ఒరే అబ్బి, ఆ పావుకోళ్ళ జత యిలా యివ్వు" అన్నాడు. "ప్రభూ! ఇవి అమ్మేవి కావు. కావాలంటే సరీగా ఇటువంటివే మరొకజత తయారుచేసి ఒక్కగంటలో ఏలినవారికి సమర్పించుకుంటాను" అని అన్నాడు నాగన్న. కాని, రాజకుమార్తె అవే, కావాలని పట్టుపట్టింది.

చివరకు ఎలాఅయితేనేమి, ఇష్టం లేక పోయినా, వేయి వరహాలకు నాగన్న ఆ పావుకోళ్ళను అమ్మివేయవలసి వచ్చింది.

నాగన్నకు ఈయటానికని రాజు తన సంచిలో చేయిపెట్టి సొమ్ము తీయబోతూ వుండేటంతలో అప్పటికప్పుడే పావుకోళ్ళలో కాళ్ళు దూర్చిన రాజకుమారి కెవ్వుమని ఒక పెద్ద కేకపెట్టింది.

అదేమిటా అని అందరూ అటువేపు చూచేవరకు, ఆ పావుకోళ్ళు వాయు

వేగంతో రాజకుమారిని ఎక్కడికో తీసుకపోతున్నై. "నన్ను పట్టుకోండి! పట్టుకోండి!!" అంటూ ఆమె గోలపెడుతున్నది. రాజకుమారి గుమ్మం దాటింది, వీధులు దాటింది. ఎక్కడికో వెళ్ళిపోతున్నది.

చేసేదేమున్నది? రాజూ, రాజువెంబడి నాగన్నా, అతనివెంట పనివాళ్ళు ముగ్గురూ గబగబలాడుతూ పరుగులెత్తారు. రాజుగారి సారటువాడు గుర్రాలను దౌడు తీయించి, రాజకుమారిని పట్టుకోవాలని యత్నించాడు. ఇంతమందీ రొజుకొంటూ, రొప్పుతుంటూ పరుగులెత్తినా రాజకుమారిని పట్టుకోలేకపోయారు. చూస్తూ ఉండగానే, ఆమె అదృశ్యమై, మరి కనబడలేదు.

రాజకుమారిని వెతికి తీసుకరమ్మని రాజు దేశదేశాలకు నౌకరులను పంపించాడు. కాని, వెళ్ళినవాళ్ళందరూ లాభం లేకపోయినదంటూ వెనక్కు తిరిగి వచ్చేశారు. అప్పుడు రాజు, తన కుమార్తె ఎక్కడున్నదో కనుగొన్నవాళ్ళకి తన రాజ్యంలో అర్ధ రాజ్యం ఇచ్చివేస్తానని చాటింపు వేయించాడు.

ఈ చాటింపు వినికూడా ఒకళ్ళూ ముందుకు రాలేకపోయారు. కాని నాగన్న






ప్రాణాలు లేచివచ్చినై. తమకు సాయపడు మని వారు అతనిని బతిమలాడారు.

అప్పుడు తిన్నడు కుక్కను చూచి, దాని కాలికి గాయంతగిలిన సంగతి గ్రహించాడు. వెంటనే తన దోవతి చించి, ఆ పేలికతో కుక్క కాలికి కట్టుకట్టేసరికి, అది తోకఆడించుకుంటూ లేచి, కృతజ్ఞతతో తిన్నడిని నాకటం ప్రారంభించింది. ఇది చూచి యక్షులు ఆశ్చర్యపోయారు.

తిన్నడు గొప్ప మంత్రగాడై ఉంటాడని యక్షులు నిశ్చయించి, అతనినీ కుక్కనూ కూడా తమ రాజువద్దకు తీసుకపోయారు. జ్ఞాని, వృద్ధుడు, దయామయుడు అయిన యక్షరాజు తిన్నడిని అనేకవిధాల సత్కరించాడు.

తిన్నడు తను వచ్చిన పని ఫలానా అని దాపరికం లేకుండా చెప్పేవరకు, 'అబ్బాయీ! నీకు జయమవుతుంది' అని ధైర్యంచెప్పి, యక్షరాజు తన పరివారంలో ఒకరిని అతనివెంట సాయం పంపడానికి వాగ్దానం చేశాడు.

యక్షరాజు వాగ్దానంప్రకారం, మరునాడు ఉదయానే ఒక యక్షుడు వచ్చి తిన్నడి ఎదట నిలబడ్డాడు. చిన్నికుక్క

వద్దనున్న పనివాళ్లలో తిన్నడనేవాడొకడు ధైర్యంగా రాజువద్దకు వెళ్ళి "రాజకుమారిని నేను తీసుకరాగలను" అని నిబ్బరంగాచెప్పి బయల్దేరాడు.

తిన్నడు పోయిపోయి. ఒక మహారణ్యం చేరుకొనే వేళకు చంద్రోదయమైంది. అక్కడ ముగ్గురు యక్షులు నేలకు వంగి ఒక చిన్న కుక్కను దీక్షగా చూస్తూ వున్నారు. ఆ కుక్క చూపులకు చిన్నదే కాని, దానిని వారు ఎంతగా పట్టి లాగినా, భూమినుండి ఊడిరావటంలేదు.

ఇంతలో తిన్నడు అక్కడికి చేరుకున్నాడు. అతని చూడగానే వాళ్ళకు

కూడా బిలబిలమంటూ తిన్నడిని నాక జొచ్చింది. వారు బయల్దేరి, యక్షుని సలహాప్రకారం, రాజకుమారి ఎక్కడ వున్నదో తెలుసుకోవటానికని ముందు ఒక మంత్రకత్తె వద్దకు వెళ్ళారు. మంత్రకత్తె శాస్త్రాలు తిరగవేసి, "అబ్బాయీ! ఇక్కడికి సమీపంలో ఉత్తరదిశను ఒక చిట్టడవి ఉన్నది. ఆ చిట్టడవి అడ్డు తగలటంచేత మీ రాజకుమారి అక్కడ చిక్కుకొని ముందుకు పోలేక నిలిచి పోయింది. ఐతే ఆమెను మీరు ఆ చిక్కు నుంచి దాటించారంటే మాత్రం మళ్ళీ ఆ పావుకోళ్ళు ఆమెను ఎత్తుకుపోతయి, జాగ్రత!" అన్నది.

"అట్లైతే అమ్మా! మేము రాజకుమారిని తిరుగా తీసుకరాగల ఉపాయమేమిటి?" అని వేడుకొనేవరకు, ఆమె ముందుగా ఒక పసరు తెచ్చి కుక్కకాలికి రాయగానే, దాని గాయం మానిపోయి అది ఎప్పటివలె నడిచింది.

తరువాత మంత్రకత్తె మంత్రాలు పఠించి, రాట్నంలోనించి ఒక నూలుపోగు తీసి ఇచ్చి, దానిని ఉపయోగించవలసిన విధానం చెప్పింది.



తిన్నడూ, యక్షుడూ పోయిపోయి చిట్టడవి కనుక్కొని, అక్కడ తుప్పలకు తగులుకొని నిలిచిపోయిన రాజకుమారిని చూచారు. ఆమెను చూడగానే చిన్నికుక్క పరుగెత్తిపోయి, రాజకుమారిని నాకటం ప్రారంభించింది. తన కుక్క ఇన్నాళ్ళకు మళ్ళీ కంటపడినందుకు మురిసిపోయి, రాజకుమారి దానిని ముద్దులాడజొచ్చింది.

ఆ సమయంలో అదునుచూచి, తిన్నడు, తను పట్టుకువచ్చిన నూలుపోగు రాజకుమారి పాదాలకు అడ్డుగా పావుకోళ్ళకు తగిలేటట్టు పడవేసి, మంత్రకత్తె ఉపదేశించిన మంత్రాలను ఉచ్చరించాడు.

తక్షణమే ఆ పావుకోళ్ళు రాజకుమారి పాదాలనుండి ఊడి ఇవతలకు వచ్చి, మరి కనపడకుండా పోయినై.

ఇంతకాలానికి ఆ పావుకోళ్ళ బాధ తనకు తప్పిందికదా అని రాజకుమారి సంతోషించి, తిన్నడి ధైర్యసాహసాలకూ, కార్య దీక్షకూ ఎంతో మెచ్చుకొన్నది. అతనినే తన భర్తగా చేసికొనవలెననికూడా తన మనస్సులో నిశ్చయించుకొన్నది. అప్పుడు అందరూ కలసి కోటకు వెళ్ళేవరకు, మళ్ళీ తన కూతురు కంటబడినందుకు రాజు అపరిమితానందభరితుడై, తిన్నడిని అనేక విధాల కొనియాడాడు.

తరువాత రాజకుమారి తన సంకల్పాన్ని తండ్రికి తెలిపేవరకూ, ఇంతాచేసి చెప్పులుకుట్టేవాడికిచ్చి పెళ్ళిచేస్తే లోక విడ్డూరంగా ఉంటుందని చెప్పి, రాజుకి ఈ ఏర్పాటు ఇష్టంలేకపోయింది. ఈ సంబంధం ఎలాగైనా తప్పించాలని చూచి, "అమ్మాయీ! వీడు వట్టి బికారీవాడు. ఇటువంటివాడిని పెళ్ళాడితే లోకం నవ్వి పోతుంది" అని కూతురుకి నచ్చజెప్ప జూచాడు.

అక్కడనే వున్న తిన్నడు "రాజా! నీవు చేసిన వాగ్దానం అప్పుడే మరిచావా? మీ అమ్మాయిని నేను కష్టపడి తీసుక వచ్చానుకదా? నీ అర్ధరాజ్యానికి నేను అర్హుణ్ణికదా? నను బికారీవాడంటా వేమిటి?" అని నిర్భయంగా అడిగాడు.

రాజు, తన తొందరపాటుకి పశ్చాత్తాప పడి, మన్నించుమని తిన్నడిని వేడుకొన్నాడు. తరువాత అతి వైభవంగా రాజకుమారికి తిన్నడికీ వివాహం జరిగింది. ఆ వివాహానికి యక్షరాజు మంత్రకత్తె వచ్చి దంపతులను ఆశీర్వదించారు. పుట్టుపేద ఐన తిన్నడు ఇప్పుడు రాజకుమారినే కాకుండా రాజ్యలక్ష్మినికూడ చేపట్టి హాయిగా ఉంటున్నాడు.






ఒకానొకప్పుడు ఒక గొప్ప ప్రళయం వచ్చింది. అంటే మనం ఉండే యీ భూలోకం, తక్కినలోకాలూ ఒక్కమాటుగా ఉన్నట్టుండి, భగ్గుమని మండిపోయి, నుసి ఐపోయా యన్నమాట. అలా ఒక్కమాటు ఇన్ని లోకాలూ నాశనమై పోతాయా ఎప్పుడైనా? కాని, ఐపోయాయి. ఎలా అంటారేమో. ఒక్కమాటు పెద్ద సుడిగాలి రంయ్ మని వచ్చేసి, లోకాలన్నీ ఒకదాన్నొకటి ఢీడిక్కి కొట్టేసుకుని ముక్కముక్క లయి పోయాయి మొదట.

అతర్వాత పన్నెండుగురు సూర్యులొక్కమాటుగా పొడిచి భగభగమండటం మొదలెట్టేరు. ఆ సూర్యగోళాలలోనించే బయల్దేరిందో ఎక్కణ్ణుంచి బయల్దేరిందో గాని ఒక మంట బయల్దేరి, సుడిగాలికి ముక్కలైపోయి ఉన్న లోకాలన్నీ అంటుకుని పెద్ద భోగిమంట తయారైంది. ఆ మంటకు గాలి తోడై, మరి కాస్సేపటికి నుసితప్ప మరేమి మిగలలేదు. తర్వాత వర్షం ప్రారంభించింది. ఆ వర్షం కూడా ఎన్నడూ కని విని ఎరగని వర్షం! కడవలు దిమ్మరించినట్లు కురిసేసింది! ఏనుగు తొండాలంత లావున ధారకట్టి కురిసింది! దానితో ఎక్కడ చూచినా జలమయమే.

కాని ఆ నిసు చూడ్డానికి ఎవరైనా మిగులేగా? దేవతలు, రాక్షసులు, మనుషులు, జంతువులు — వారేమిటి, వీరేమిటి— అందరూ నుసిఐపోయి, ఆ నీటిలో కరిగిపోయారు. దేవుడైనటువంటి ఒక్క విష్ణుమూర్తి మిగిలేడు. లోకాలన్నీ నాశనమైపోయినా దేముడికి నాశనం ఉండదు. ఆ మహాసముద్రంలో ఆయనొక్కడూ ఓ మర్రి ఆకుమీద పడుక్కుని హాయిగా గుఱ్ఱుపెట్టి నిద్రపోతున్నాడు. ఇంతకాలం ఈ లోకాలన్నింటినీ కనిపెట్టుకుని ఉండడంలో

పి. సత్యనారాయణ మాంబళం



ఒక్క కునుకు కూడా తియ్యలేదాయన. ఇప్పుడే కాస్త విశ్రాంతి తీసుకుందామని పడుం వాల్చాడు.

పడుం వాల్చాడేగాని ఆయన అలా ఎంతసేపో పడుకోలేదు. ఈ లోకాలన్నీ చాలా పాతవైపోయి, ఎందుకూ పనికిరాక పోవటంచేత ప్రళయం తెప్పించి వాటిని నాశనం చేశాడు. మెలకువ రావటంతోనే లోకాలన్నీ మళ్లీ ఎలాగా సృష్టించాలి. లేకపోతే ఆయన కొక్కడికీ ఆ మహాసముద్రంలో ఏంతోస్తుంది? కాస్సేపయ్యాక లేచి, బ్రహ్మచేత మళ్లీ లోకాలన్నీ సృష్టిచేయిద్దామని అనుకుని ఆయన కన్ను మూశాడు.

కాని మీకో సందేహం వస్తుందిప్పుడు. మళ్లీ లోకాలన్నీ సృష్టి చెయ్యటానికి బ్రహ్మ ఏడీ? అతడు మాత్రం ఈ ప్రళయంలో నశించిపోలేదా? అని. ఐపోయాడు. పోతేయేం? మళ్లీ పుట్టేడు. ఆ మఱ్ఱిఆకుపైన నిద్రిస్తోన్న మహావిష్ణువు బొడ్డులోంచి ఓ తామరతూడూ, ఆ తూడు కొసని ఓ పెద్ద తామరపుష్పం పుట్టేయి. ఆ పుష్పంలో బ్రహ్మదేవుడు తొట్టెలో పిల్లాడికిమల్లే ఆడుకుంటూ కూచున్నాడు.

అప్పు డెక్కణ్ణుంచి వచ్చారో గాని ఇద్దరు రాకసులొచ్చారు. వారిలో మొదటి వాడిపేరు మధువు. రెండోవాడిపేరు కైటభుడు. కమలంలో ఆడుకుంటూన్న పసి బ్రహ్మను చూచేటప్పటికి, వాళ్లకి అతణ్ణి ఏడిపించాలని బుద్ధిపుట్టింది. మధువేమో ఆ పిల్లవాని బుగ్గ గిల్లేడు. కైటభుడు తొడ పాయసం పెట్టేడు. వాటితో బ్రహ్మ 'కేరు' మన్నాడు. విష్ణుమూర్తికి మెలకువొచ్చి, కళ్లుతెరచి చూచేటప్పటికి, ఆ భయంకరాకారులు ఇద్దరూ కనపడ్డారు. విష్ణుమూర్తికి ఆశ్చర్యంవేసింది.

" ఈ ప్రళయంలో అందరూ నాశనమైపోయారనుకుంటే వీళ్లెలా మిగిలారు?"

అనిపించిందాయనకి. ఆయనకేగాదు, మీకూ అనిపిస్తుంది. దేవతలూ, రాక్షసులూ, మనుష్యులూ, అందరూ నశించిపోయారనుకున్నాంగా మరి? అందరూ నశించి, వీళ్ళిద్దరూ మాత్రం మిగిలేరూ అంటే, వీళ్ళు ఎవరో చాలా ఉపద్రులన్నమాట!

"ప్రళయం కూడా మిమ్మల్ని ఏమీ చెయ్యలేకపోయింది గనక, మీ సామర్థ్యానికీ, ప్రజ్ఞకీ మెచ్చుకున్నాను. అందుచేత ఏదైనా వరం కోరుకోండి" అన్నాడు విష్ణుమూర్తి.

ఆమాటలు వినేటప్పటికి వాళ్ళిద్దరూ పకపకా నవ్వుతూ "ఏమిటీ? నువ్వా మాకు వరాలివ్వటం?" అన్నారు.

"ఏం? అలా అంటున్నారు?" అని అడిగాడు విష్ణువు.

"అలా అనడమేమిటి? ప్రళయానికి ప్రళయాలమైన మాకా ఒకడు వరాలివ్వటం? ఇంకా నిద్రమత్తుతో ఉండి మాట్లాడుతున్నావు గనక, అది ప్రథమ తప్పిదంకింద భావించి నిన్ను వదిలేశాం." అన్నారు వాళ్ళు.

ఆ మాటలు వినేటప్పటికి విష్ణుమూర్తే తెల్లపోయాడు. ఏమనాలో తోచక ఆలో




చిస్తూంటే, మధువు—"కైటభా, ఇతగాడికి మన సంగతి తెలీదు గనక ఇలా మాట్లాడేడు. మన గొప్పతనం కాస్తంత మచ్చు చూపించాలి" అన్నాడు.

కైటభుడు, "మనకి వరాలిస్తాననివాగేడు గనక మనం ఒకళ్ళకి వరాలిచ్చేబాపతేగాని ఒకళ్ళవద్దనుంచి పుచ్చుకునే బాపతు కాదని వీడికి తెలియచేస్తేసరి." అన్నాడు.

"శబాష్," అన్నాడు మధువు.

'మహా ప్రజ్ఞావంతులం' అనే గర్వం చేత కళ్ళు మూసుకుపోయి, బుద్ధి మందగించి, తామేం చేస్తున్నదీకూడా తెలుసుకోకుండా ఆ మధుకైటభు లిద్దరూ గర్వంగా

విష్ణుమూర్తికేసి తిరిగి, "కోరుకో నీకేం వరం కావాలో, మేమేయిస్తాం!" అన్నారు.

విష్ణుమూర్తి ఆలోచించి "వీళ్లని ఉపేక్ష చేస్తే కొంప మునుగుతుంది వీళ్లపని పడదాం" అని నిశ్చయించుకొని వినయం కనపరుస్తో, "మహాత్ములారా, మీరు చాలా ఉదారపురుషులు! మీ దర్శనంవల్ల నా జన్మ పావనమైంది. ధన్యుణ్ణి! మీలాంటి వారు వచ్చి, 'వరం కోరుకో' అంటే 'వద్దు' అంటానా? అనుగ్రహించండి" అన్నాడు.

"ఊఁ, కోరుకో. సందేహిస్తావేమిటి?" అన్నారు వాళ్ళు.

"అబ్బే, సందేహమెందుకు? మీలాంటి వారు ఆడి తప్పుతారుగనకనా? కోరుకుంటున్నా వినండి. మీ ఇద్దరూ కూడా ఇప్పుడు నా చేతిలో చచ్చిపోవాలి!" అన్నాడు విష్ణుమూర్తి.

ఆ మాట వినేటప్పటికి మధుకైటభులకి తెలిసొచ్చింది. నవ్వులన్నీ పోయి ఒకళ్ల మొహం ఒకళ్లు చూచుకోడం మొదలెట్టేరు. ఐతేయేం? ఒక్కక్షణమే అలా ఉన్నారు. 'ఏ వరమైనా ఇస్తాం' అన్నారుగా? ఆడితప్పరు.

వాళ్లు దుర్మార్గులైన రాక్షసులే అయినా వాళ్లలో ఆ నిజాయతీ ఉంది. "విష్ణుమూర్తీ, నీ తెలివితేటలకి మెచ్చుకున్నాం. పుచ్చేసుకో మా ప్రాణాలు!" అని సిద్ధపడ్డారు.

సిద్ధపడడమే కాదు; వాళ్లు మరోమాట కూడా చెప్పేరు. "మాకు నీరు ఉన్నచోట చావులేదు. ఇప్పు డెక్కడ చూసినా నీటిమయం. మరి మమ్మన్ని చంపే ఉపాయం నువ్వే ఆలోచించుకో" అన్నారు.

విష్ణుమూర్తికి, వాళ్లని చంపే ఉపాయం ఆలోచించటం ఓ లెక్కా? "ఎంతసేపు?" అంటూ ఆయన తన రెండు తొడలూ పెంచేసి, ఆ తొడలమీద చెరొక రాక్షసుణ్ణీ పడుకోబెట్టి, తన సుదర్శన చక్రంతో వాళ్ల కంఠాలు తెగేశాడు.






# పుండరీకుడు

పూర్వం పుండరీకుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆతని భార్య సుచరిత. ఆ దంపతు లిద్దరూ పాండురంగని భక్తులు. పాండురంగ విఠలుణ్ణి దర్శించటంకోసం ఒకప్పుడు ఆ ఊళ్ళో ఉన్న భక్తులంతా గుంపులు గుంపులుగా కూడి భజనచేస్తూ పండరీపురానికి బయలుదేరారు.

సుచరిత యిది చూచి భర్తతో, "ఏమండీ, మనంకూడా పండరీపురం వెడదామా?" అని అడిగింది.

"ఇంట్లో శతవృద్ధులై అన్నిటికీ మనపైన ఆధారపడిఉన్న తలితండ్రుల్ని విడిచి మనం ఎక్కడికి వెళ్ళటానికి వీలు? మనకి ఇల్లే పండరీపురం. ఆ పాండురంగ విఠలుణ్ణి మనస్సులో ధ్యానించుకుంటూ, ఈ ముసలి దంపతులకు సేవచెయ్యటం కన్న మనకి మరొక ఆలోచన ఉండ కూడదు" అన్నాడు పుండరీకుడు.

మనసులో గట్టిగా ఆ భక్తులతోపాటు వెళ్ళాలని వున్నా, సుచరిత పైకి ఏమీ అనలేక ఊరుకుంది. తక్కిన భక్తులంతా అనుకొన్న ప్రకారం బయల్దేరి పండరీపురం వెళ్ళిపోయారు.

ఆ వెళ్ళిన భక్తులకుకూడా ఇళ్ళల్లో ముసలి తలితండ్రులో లేక రోగిష్ఠి భర్తలో, భార్యలో, పిల్లలో లేకపోలేదు. కాని వాళ్ళు [illegible]కునికి మల్లే "మనం వెడితే [illegible]ళ్ళ గతేమికాను?" అని ఆలోచించక, "ఎవళ్ళఖర్మ వాళ్ళది. వీళ్ళ కోసం మనం పండరీపురం వెళ్ళటం మానుకుంటామా?" అని నిశ్చింతగా చక్కాపోయారు.

పుండరీకుడు మటుకు తాను పండరీ పురం వెళ్లలేక పోయినందుకు కొంచెమైనా దిగులుపడలేదు. ప్రతిరోజూ ప్రొద్దున్నే లేచి, వెయ్యిమంది పరిచారికలపెట్టు ఐ

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



తలితండ్రులకి సేవ చేసేవాడు. పాపం వాళ్ళు కూచుంటే లేవలేని ముసిలివాళ్ళు. వాళ్ళకి వెచ్చటి నూనె వొళ్ళంతా రాసి, నలుగుబెట్టి గోరువెచ్చటి నీటితో స్నానం చేయించేవాడు. తెల్లటి మెత్తటి శుభ్రమైన తువ్వాలుతో తుడిచి తేలిక బట్టలు కట్టించేవాడు. చెయ్యి ఊతయిచ్చి, లోపలికి తీసుకొచ్చి. దేవతార్చన పీఠానికెదురుగా పీటల మీద కూర్చోపెట్టి, తండ్రికి సంధ్యావార్చుకునే నిమిత్తం జారీతెచ్చి ఇచ్చేవాడు.

తండ్రి చాలా గొప్ప పండితుడూ, భక్తుడూ, కర్మిష్ఠిని. ఐతేయేం? ముసలితనం వల్ల జ్ఞాపకశక్తి తగ్గిపోయి, దేవతార్చన చేసుకునేటప్పుడు మధ్య మధ్య మంత్రాలు కూడా మరిచిపోయేవాడు. పూజ అయేదాకా పుండరీకుడు దగ్గిర కూచుని, తండ్రి మరిచిపోయి తడబడుతూన్న మంత్రాలు జ్ఞాపకం చేస్తూండేవాడు. ముసలితనంవల్ల ఆ తండ్రికి చూపు సరిగ్గా ఆనేదికాదు. దేవతార్చన సమయంలో గంధం, అక్షతలూ, యజ్ఞోపవీతం పువ్వులూ మొదలైన పూజా వస్తువులకోసం ఆవృద్ధుడు తడుముకుంటూవుంటే పుండరీకుడు వాటిని తీసి అందిస్తూండేవాడు. అదేసమయంలో తాను గూడా పాండురంగ విఠలునికి పూజచేసి, తులసి తీర్థాన్ని తల్లికీ తండ్రికీ ఇచ్చేవాడు. పంచభక్ష్య పరమాన్నాలూ చేయించి భగవంతునికి నైవేద్యం పెట్టి తల్లి తండ్రులకు వడ్డించి, తర్వాత తను తినేవాడు.

ఆ ముసిలివాళ్లకి సహజంగా వృద్ధాప్యం వల్ల అస్తమానం చిరాకూ కోపం వచ్చేది. తనుకూడా వాళ్ళతోబాటు చిరాకు పడక, పుండరీకుడు వాళ్లని చిన్న బిడ్డల్ని లాలించినట్లు లాలించేవాడు. వాళ్లు ఏదికావాలంటే అది ఎంత అసాధ్యమైనా తెచ్చి ఇచ్చేవాడు.

పుండరీకుడు ఈవిధంగా తలితండ్రులకు సేవచేస్తూ వెనక దిగడిపోగా, తక్కిన

భక్తులంతా "జయ పాండురంగ విఠలే" అని భజన చేస్తూ, పండరీపురం చేరుకున్నారు.

వాళ్ళు ఆలయంలో ప్రవేశించేసరికి పాండురంగడు గుడిలో లేడు! ఆ పీఠం ఖాళీగా కనపడింది!

'స్వామి ఏడీ! స్వామి ఏడీ!!' అంటూ భక్తులంతా కలవరపడ్డారు. స్వామి తిరిగి వస్తాడేమోనని వాళ్ళు అక్కడే చాలాసేపు కనిపెట్టుకూర్చున్నారు. ఆరోజల్లా స్వామి తిరిగి రాకపోయేసరికి వాళ్ళు చక్కాపోయి మళ్ళీ మర్నాడు వచ్చి చూశారు. అప్పటికీ స్వామి రాలేదు. అలా ఎన్నిరోజులు పండరీపురంలో కనిపెట్టుకుని ఉన్నా స్వామి రాలేదు. భక్తులకు ఇదంతా ఏమీ అర్థం కాలేదు. ఆఖరికి ప్రాణం విసిగి భక్తులంతా తిరిగి పుండరీకుడున్న తమ గ్రామానికి చేరుకున్నారు.

పాండురంగస్వామి దేవేరితో సహా గుడి వదలి పుండరీకుడున్న ఊరికి వచ్చెయ్యటమే ఆయన గుళ్ళో లేకపోవటానికి కారణం. వృద్ధులైన తలితండ్రులకు పరిచర్యచేస్తూ తన్ను చూడటానికి ఆ మహాభక్తుడయిన పుండరీకుడు తన వద్దకు



రాలేక పోయాడుగదా అని పాండురంగడే అతని వద్దకు వెళ్ళేడు. కాని, ఈ దేవరహస్యం సామాన్యజనానికి ఏం తెలుస్తుంది?

స్వామివచ్చి పుండరీకుని ఇంటి వాకిట నిలబడేవేళకి ఆతను తన తల్లి తండ్రులకు భక్తి శ్రద్ధలతో నీళ్లు పోస్తున్నాడు.

"పుండరీకా, భక్తాగ్రేసరా! నువ్వు పండరీపురం రాలేకపోయావని తెలిసి, మేమే నీవద్దకు వచ్చామయ్యా" అని స్వామి పుండరీకుణ్ణి పిలిచాడు.

"స్వామీ, ఇదుగో వచ్చేస్తున్నా. ఒక్క క్షణం ఆగండి. మా తండ్రికి నీళ్ళు పోసె



య్యాటం అయింది. వెంటనే తుడవకపోతే వృద్ధుడికి జలుబు చేస్తుంది. తుడిచేసి, లోపలకు తీసుకొచ్చి కూర్చోపెట్టి నీ దర్శనానికి వస్తా" నన్నాడు పుండరీకుడు.

ఆమాటలు విన్న సుచరిత ఆశ్చర్యపోయింది. భగవంతుడు దేవేరిసహా వచ్చి వాకిట నిలపడితే ఎదురురాక "వస్తా అలాగే నిలపడి ఉండు" అనవచ్చా? స్వామికేమి కోపం వస్తుందో? అని ఆమె భయపడి చూస్తున్నది. కాని శాంతమూర్తి అయిన స్వామికి కొంచెంకూడా కోపం రాలేదు. వచ్చి వాకిట పడికట్టుమీద నిలపడ్డ వాడు అలగే నిలుచుండిపోయాడు.



మరి కొంతసేపటికి పుండరీకుడు తల్లి తండ్రుల్ని లోనికి తీసుకువెళ్ళి, ఉతికి వుంచిన బట్టలు కట్టించి, దేవతార్చన పీఠానికి ముందు పీటలపై కూర్చోపెట్టి, జారీ దగ్గిరపెట్టి 'ఒక్క క్షణంలో వస్తాన'ని తలిదండ్రుల అనుజ్ఞ తీసుకుని, అప్పుడు పాండురంగ స్వామికి స్వాగతం ఇవ్వటానికి బయటికివచ్చాడు.

పిలవగానే వెళ్ళక, ఇంత ఆలస్యం చేయడమూ, పైగా పని చూసుకు వచ్చేవరకూ ఉండుమనటమూ ఎంత పొరపాటు! అందులోనూ కేవలమూ స్వామితోనా ఇటువంటి జవాబులు చెప్పటం? స్వామి కోపంతో భర్తని ఏమంటాడో అని సుచరిత పాండురంగనికేసే చూస్తూవుంది. ఏం చిత్రమో? పాండురంగడేనా ఇప్పుడు ఆ పడికట్టు మీద నిలపడివున్నది? కాదు. ఎవరో ముసిలాయన! ఎవరోఏమిటి? తన మామగారిలాగే ఉన్నాడు! అప్పుడేగా తన భర్త మామగారిని స్నానం చేయించి లోపలికి తిసుకు వెళ్ళింది? అంతవరకూ ఆ పడికట్టు మీద స్వామి పక్కన నిలపడి ఉన్న దేవేరికూడా ఇప్పుడు కనపడదే? ఆమె స్థానే తన అత్తగారికి మల్లే ఉన్న





ముసిలామె ఎవరో నిలపడి ఉన్నది! సుచరితకు ఒక్క క్షణంలో ఇదంతా అర్థమైపోయింది.

తలితండ్రులకు పరిచర్య చెయ్యటమే పరమధర్మంగా భావించి తనభర్త పండరీపురం వెళ్ళలేదు. 'ఆ తలితండ్రులకు పరిచర్య చెయ్యటం మాకు పరిచర్య చేయటంలాంటిదే సుమా' అని తనకు తెలపటం కోసం లక్ష్మి నారాయణులు తనకు అత్తమామలరూపంలో కనపడుతున్నారు" అని ఆమె తెలుసుకుంది.

పుండరీకుడు ఇంతలో లక్ష్మి సమేతుడైన స్వామికి సాష్టాంగ నమస్కారంచేసి, "గరుడవాహన! జగన్నాధ! పుండరీకాక్ష! పాండురంగా!" అని అనేక విధాల స్తోత్రం ప్రారంభించాడు.

పాండురంగడూ దేవేరీకూడా పరమానందభరితులై తమ అభయహస్తాలను అతని శిరస్సున ఉంచి, "పుండరీకా! భక్తాగ్రేసరా! వృద్ధులైన నీ తలిదండ్రులకు నీవు భక్తి తాత్పర్యాలతో చేసిన పూజా, పరిచర్యా మాకు చెందినై. కుమారా నీకేమి కావాలో కోరుకో" అన్నారు. సుచరిత తన భర్త ఏంవరం కోరుతాడో అని వింటోంది.

పుండరీకుడు, "స్వామీ! నాకూ, నా భార్యకూ కూడా అందరి భక్తులకు మల్లేనే నీ సన్నిధిలో ఉందామని ఉంటుంది. కాని శతవృద్ధులయిన నా తల్లిదండ్రుల్ని విడిచి పండరీపురంరాలేము. మమ్మల్ని కటాక్షించటం కోసమని శ్రమపడి ఇంత దూరం ఎలాగా వచ్చారు గనక మీరిక్కడనే ఆగిపొండి. ఇదే నా కోరిక" అన్నాడు. ఆకోరికవిని సుచరిత ఆశ్చర్యపోయింది. తమ్ము కటాక్షించటానికి ఒక మారు స్వామి దేవేరితో వేంచేశాడు గాని శాశ్వతంగా ఇక్కడనే ఉండిపొమ్మంటే ఉంటాడా అనుకుంది.

కాని పాండురంగడు తన భక్తుడైన పుండరీకుడు కోరిన ప్రకారం అక్కడే, ఆ పడికట్టుమీదే దేవేరితో సహా ఉండిపోవటానికి ఒప్పుకున్నాడు. అంతే కాదు. గంగాదేవిని రప్పించి, "ఇక్కడ నేను ఉండిపోతున్నాను. అందుచేత ఇది ఇంకా గొప్ప పుణ్యక్షేత్రమై ఎక్కడెక్కడి భక్తులు నాదర్శనంకోసం ఇక్కడకే వస్తారు. వాళ్ళకి స్నానపానాదులకు వీలుగా ఇక్కడ శుభ్రమైన నీటితో ప్రవహించే మంచి నది ఒకటి కావాలి. అందుచేత నువ్వికక్కడ ప్రవహించు" అని ఆజ్ఞాపించాడు.

తక్షణమే అక్కడ గంగాదేవి నదిగా ఏర్పడింది. పుండరీకునిగ్రామమే పుండరీక క్షేత్రమైంది. పాండురంగని దర్శనంకోసం, భక్తులేక బ్రహ్మ, శివుడూ మొదలైన దేవ గణమందరూ అక్కడికి వస్తూండెవారు.

ఊళ్ళోఉన్న భక్తుల సంతోషానికి మేర లేకపోయింది. పుండరీకునిసంగతి తెలిశాక వాళ్ళందరికి ఒక కొత్త జ్ఞానం కలిగింది. తమర్ని కనిపెంచి పెద్దవాళ్లనిచేసి ఆఖరికి ముసలితనంవల్ల మూలపడి తమమీద ఆధారపడిఉన్న తలితండ్రులకు పరిచర్య చెయ్యటమే భగవంతుణ్ణి సంతోషపెట్టటం అని వాళ్ళంతా తెలుసుకున్నారు.

మానవు లందరకూ కొన్నికొన్ని విధులు ఏర్పడివున్నాయి. ఎలాఅంటే బిడ్డలు తలిదండ్రులను సేవించటం. భార్యలు భర్తలను సేవించటం, భాగ్యవంతులు పేద వారికి సహాయపడటం, ఆరోగ్యవంతులు వ్యాధిగ్రస్తులకు పరిచర్య చేయడం. ఈ విధులను పాటించక చేసే భక్తుల పూజలు వ్యర్థమే అవుతై.

తన విధి నెరవేర్చిన పుండరీకుని వెతుక్కుంటూ ఆ దేవుడే వచ్చి, భక్తుని కోరికలు నెరవేర్చాడు. తమ విధులు పాటించని భక్తులు పండరీపురం పోయి, వ్యర్థంగా తిరిగి రావలసివచ్చింది.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

2. కారణము
4. పడవ
6. పేరు
8. యాదవకులంలో యిది కలిగింది
10. ఇది మత్తు కలిగిస్తుంది
14. పవిత్ర గ్రంథాలు
15. వెనుక
16. తిరగబడిన సంగతి
17. ఒకరకమైన కొలత
18. ఔషధంగా వాడవచ్చు




### నిలువు :

1. సంతోషము
3. చంద్రగుప్తుని తల్లి
4. సుద్ద
5. ఔషధ ద్రవ్యము
7. ఒక సంస్కృత గ్రంథం
9. తీగ
11. లిప్త
12. కసరత్తు
13. రాళ్ళు
14. ముందుకుపోవుట
15. భర్త
17. ఒక ద్వీపము

## చెడ్డవాళ్ల పనులు

అనగనగా ఒక ఊరుంది
ఊరవతల ఒక యేరుంది.
ఏరుకు బారెడు దూరంలో
కారడ వొక్కటి జేరుంది.

ముడిగా ఒక్కటి ప్రతిరోజు
అడవికి పోతూ ఉండేది
కడుపు నిండ మేసొచ్చేది
కడవ నిండ పాలిచ్చేది.

అట్లా కొన్నాళ్లయినాయి
ఆవూ బాగా బలిసింది.
అంతట నాలుగు తోడేళ్లు
ఆవును చూచా రొకనాడు.

చూడగానె తోడేళ్లల్లో
పాడుబుద్ధి పుట్టేసింది
'బాగా బలిసింది ఆవు
భక్షించా' లనుకున్నాయి.

సమయంకోసం చూచాయి
జమాయించి పైబడ్డాయి.
చటుక్కునావుకి ప్రాణాలు
గుటుక్కుమని అది చచ్చింది.

చంపినదంతా నేనంటూ
సగము నాకు రావాలంటూ
తగని ఆశతో తోడేళ్లూ
తగవులాడుకో సాగాయి.

పోట్లాడుతు ఆ తోడేళ్లూ
కాట్లాడుకునీ చచ్చాయి.
చంపగానె సరిపోయిందా?
పంపకాలు తెగిపోవద్దా?

రచన : ములుగు తిరువెంగళాచార్యులు



# పిల్లల పెంపకం

## పళ్లను గురించిన జాగ్రత్తలు

పుట్టినవెంటనే చూశామంటే, శిశువు నోటిలో మనకు పళ్ళు కనిపించవు. అందుచేత, శిశువు నోరు బోసిగా వున్నదని అనుకొంటాము. కాని నిజానికి, శిశువు నోటిలో పైన పది, క్రింద పది - మొత్తం ఇరవై పళ్ళు పుట్టుకతోనే దవడలలోపల దాగివుంటాయి.

శిశువుకు పళ్ళు ఎప్పుడు వస్తాయి? అంటే, నిర్ధారణగా చెప్పవీలుకాదు. వాళ్ళ వాళ్ళ శరీరతత్వాలను బట్టి, ఆరవ నెల మొదలుకొని ఏణ్ణర్ధంవరకూ కొంచెం ముందు వెనుకలలో ఇరవై పళ్ళూ వచ్చేస్తాయి. రావలసిన కాలానికి రాక, కొంచెం ఆలస్యమైనా ఆత్రపడవలసిన పనిలేదు.

శిశువు ఆరోగ్యంగా ఉన్నట్టయితే, అనగా పెరుగుదలకు అవసరమైన విటమిన్లు, ఖనిజలవణాలూ శరీరంలో ఉండటం, సరియైన వేళపాళల్లో ఆహారం సరీగా అందటం, జరిగినప్పుడు పాలపళ్ళు వస్తున్నప్పుడు శిశువుకు ఇబ్బంది ఏమీ కలుగదు.

కాని, సామాన్యంగా పాలపళ్ళు వస్తున్న కాలంలో, ఇగుళ్లలోనించి అవి పొడుచుకు వచ్చినప్పుడల్లా బిడ్డకు వంట్లో చీకాకు కలుగుతూవుంటుంది. ఇగుళ్లు వేడిఎక్కి ఎర్ర బడటం, వాచడం, లాలాజలం ఎక్కువగా ఊరడం, ఇవన్నీ శిశువు అనుభవించే బాధలే. దాహం ఎక్కువగా ఉంటుంది. పాలు సరిగా తాగదు. భేది, వాంతి కూడ కావచ్చు. అటువంటప్పుడు కొంచెం కాచిన నీళ్లు, పండ్ల రసం ఇవ్వటం మంచిది. ఈ సమయంలో మామూలప్పటికంటె శిశువును ఎక్కువ మెలకువతో కనిపెట్టటం అవసరం. కనుక పాలపళ్లు వచ్చేకాలంలో అవకాశాన్ని బట్టి బిడ్డను తరుచు వైద్యునికి చూపటంమేలు.

బిడ్డకు ఈ పాలపళ్లు క్రమంగా ఊడిపోయి, సామాన్యంగా ఏడవ యేడునించి అసలు పళ్లు రావటానికి ప్రారంభమవుతయి. పళ్లు జాగర్తగా ఉండడం శిశువు తినే ఆహారంపైన ఆధారపడి వున్నదని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు: కాల్షియం (సున్నం) విటమిను 'డి' లు పుష్టికరంగా ఉండే ఆహారం పళ్ల పటుత్వానికి చాలా అవసరం.

'మీ పెద్దమ్మ'




పైన కనిపిస్తున్నది ఒకగది. ఈ గదిలోవున్న పది కుక్కలూ దేనికదే ఒకదానికి దొరకకుండా మరొకటి ఇక్కడవున్న మాంసపు ముక్కని కాజెయ్యాలని చూస్తున్నాయి. ఒక గోడనించి మరొక గోడకు ఒక్కొక్క గీతచొప్పున నాలుగు గీతలుగీసి ఈ పది కుక్కలనూ పది భాగాలలో వుండేట్టు వేరుచెయ్యండి. అలాచేస్తే మాంసపు ముక్కకూడా విడిగా మరొక భాగంలో, వాటికి వేటికీ అందకుండా వుండిపోతుంది. ఇది ఎలా చెయ్యాలో మీకు తెలియకపోతే జవాబుకి 54-వ పేజీ చూడండి.








# అంకెల తమాషాలు

## మొండి సంఖ్య

142857—ఈ సంఖ్య చాల మొండిది. దీనిని 2 చేత హెచ్చవేస్తే, జవాబులో తిరిగి అవే అంకెలు స్థానాలుమారి వస్తయ్. 3 చేత, 4 చేత, 5 చేత, 6 చేత, హెచ్చవేసినా అవే అంకెలు స్థానాలు మారి వస్తవేగాని మరో కొత్త అంకె రాదు. కాని ఈ సంఖ్యని 7 చేత హెచ్చవేస్తే, యిదివరకులాకాక, జవాబులో అన్నీ తొమ్మిదులే వస్తయ్.

142857 × 2 = 285714
× 3 = 428571
× 4 = 571428
× 5 = 714285
× 6 = 857142
× 7 = 999999

## యుక్తి లెఖ్ఖ

ఒక పెద్దకోట వున్నది. ఆకోటలో ప్రవేశించి లోపలికి వెడితే. మీకు వరసగా పది గోడలు తగులుతై. ప్రతిగోడకి వాకిళ్లు వున్నై. గోడల వాకిళ్లు యీవిధంగా వున్నయ్.

మొదటి గోడకి ఒక్క వాకిలి
రెండవ గోడకి రెండు వాకిళ్లు
మూడవ గోడకి మూడు వాకిళ్లు
నాల్గవ గోడకి నాలుగు వాకిళ్లు
ఐదవ గోడకి ఐదు వాకిళ్లు
ఆరవ గోడకి ఆరు వాకిళ్లు
ఏడవ గోడకి ఏడు వాకిళ్లు
ఎనిమిదవ గోడకి ఎనిమిది వాకిళ్లు
తొమ్మిదవ గోడకి తొమ్మిది వాకిళ్లు
పదవ గోడకి పది వాకిళ్లు

పదో వాకిలి వెనకాల కోటలో కొన్ని ఏనుగలు వున్నై. అవి కోటబైటికి నీటికి వచ్చేటప్పుడు ఒక పద్ధతిగా వస్తయ్. వాటికి మొదట పదోగోడ తగులుతుంది కదా? అప్పుడు ఆ ఏనుగులు ఆ గోడకి వున్న పది వాకిళ్లలోంచి సరిసమాన గుంపులుగా ఏర్పడి బైటికి వస్తయ్. ఎలాఅంటె మొత్తం 100 ఏనుగులు అనుకోండి. 10.వ గోడలో వున్న పది వాకిళ్లలోంచి పదిఏనుగులచొప్పున వస్తయ్. యిలాగే ఆ వున్న ఏనుగులు మొత్తం సమాన గుంపులుగా ప్రతి గోడకివున్న వాకిళ్లలోంచి బైటికివస్తయ్. మొత్తం ఏనుగులెన్నో కనుక్కోండి? కనుక్కోలేకపోతే జవాబుకి 54-వ పేజీ చూడండి.

# ముగ్గులు



పి. రమామణి. శ్రీశైలం



డి. కమలకుమారి, బాపట్ల



ఆర్. లలిత, మద్రాసు

## రోకంటి పాటలు

మారాజు కోటయ్యా మండపముమీదా
వేదాలు చదివేరు పెదబ్రాహ్మల్లు.
మారాజు కోటయ్యా మండపముమీదా
మాటలతో తెల్లారు మాస శివరాత్రి.

* * *

అల్లుడొచ్చాడంచు అతిసంబరాన,
కూతుర్ని పిలిచె నొక గుణముగల తల్లి-
"చిత్తారి కోటాన పుత్తడీ బొమ్మా!
సభలోని చంద్రుల దేవిరావమ్మా!
చీకటీ చింతల్లు మొలకమామిళ్లు,
కలకోటివృక్షములు నేగన్న కలలు.
కార్తీక పున్నాన కడవమాసమున
కన్నారు కార్తీకనోము నోచారు.
ఆ నోము నోచిన ఆరునెలలాకూ,
అన్నయ్యా కుమాళ్ళ తండ్రికావలెను.
మావదిన పట్టాభిదేవి కావలెను.

* * *

వీరాధి వీరుడా వీరభద్రుండా,
వినవయ్యా మీవదిన పాటపాడిందీ.
ఏమనీ పాడింది? యూపారగన్య
బొడ్లోది ఛురకత్తి బోణాలభరిణ.
తాటిపండ్లకుపోయి తలవగ్గరాదు,
తనకైన పురుషుణ్ణి ఎదురాడరాదు.
చక్కదనమూచూచి వెంటబోరాదు.
చవిచెడ్డ తమ్ములకు చెయిచాపరాదు.
గొర్రెల కాసేటి గొల్ల బోయడికి
కొంగేల బరచేవు గోపిదేవమ్మ?

గొల్ల బోయడుకాడు గోపాలస్వామి!
మంద బోయడుకాడు మనప్రాణనాథ!
వేసంగికాలాన పూసె బూరిగెల్లు
ఆశపడి చిలుకల్లు అర్నెల్లు ఉండె.
పువ్వుబూసిందాక పుని కొమ్మనుండు.
కాయ కాసిందాక కడకొమ్మనుండు.
తినబోతె దూదాయె,-తీపిలేవాయె!
చిలకల్ల మనసుల్లు చిత్తుబోత్తాయె.
రోకళ్లు మనవాడ, రోలుమనవాడ
తిరగళ్లు మనవాడ, తిరిగిరావమ్మ!

నంపాదన { లక్ష్మినారాయణ
బనపపూర్ణమ్మ

పజిలుకు జవాబు



కుక్కలబొమ్మకి జవాబు:
గీతలు యిలాగిస్తే కుక్కల్ని వేరుచెయ్యావచ్చు
3 నించి 22 కి; 9 నించి 28 కి;
12 నించి 35 కి; 20 నించి 38 కి

యుక్తిలెఖ్ఖకు జవాబు:
కోటలో మొత్తం 2,520 ఏనుగలు వున్నాయి

# అంపకాల పాట

అత్తవారింటికి అంపవలె నిన్ను
అట మెలగు పద్ధతుల నన్నిటినివినుమా
అత్త కోడరికమూ కత్తిపై సాముా
ఏలాగు మెలగెదవొ ఎరుగనే తల్లి!
అత్త మామల యాజ్ఞ చిత్తమున నుంచీ
పనులన్ని నెరవేర్చి పతికడకు జనుమీ.
బావగారెదుటను పడబోకు మమ్మా
ఎదురాడబోకు నీ వదినె కెన్నడును
ఆడుబిడ్డలతోటి ఆడుకొనుచుండు
మరదుల నెల్లపుడు మంచిగా జూడు.
జిహ్వ కిష్టంబనుచు చిరుతిండ్ల కొరకు
ఖర్చు బెట్టగబోకు కాసయిన గాని.
ఇరుగు పొరిగిండ్లకు ఇంతిరో నీవూ
పలుమారు బోకుమా పనులు లేకుండా.
ఊరి చుట్టాలతో ఊసులాడుటకు
వెంట నెవరూలేక ఒంటరిగపోకూ!
భర్త కిష్టంబుగ భామరో నీవు
పదునెరిగి వంటలను పచనంబుజేయు.
భర్త మేల్కొనకుండ పడతిరో నీవు
పడకనుంచీ లేచి పనిపాట్లు జేయు.
వంటకు కూరలు యింట లేనపుడూ
కంది పచ్చడియైన కంది గుండైనా
సరిపుచ్చుకొనుటయే సదుపాయమమ్మా.
స్త్రీభక్తజనములకు భ్రమసి పోకమ్మా
భర్తయే దైవమని భావించవమ్మా.
అత్త యొకనాడైన మెత్తనై యుండు
విధ వాడబడుచున్న విధమెల్ల వేరు
విధ వాడబడుచుకు ఒదిగుండవమ్మ
తలచెడ్డ దానితో తగవేటి కమ్మా?
నీయత్త మామలు నిన్నేమనంటె
కంట తడిబెట్టకు కలికరో నీవు
మగడు కోపించిన తగవులాడకుమా,
వీధివారు నిన్ను వెక్కిరించెదరు.

తన బట్ట తాగట్టి తనతిండి తినుచూ
లోకులకు వెరువవలె లోకంబులోన!
పాటల్లు పాడితే ఏలవంటారు
పాడకుంటే జనులు మూగ యంటారు!
లోకుల్ని అందుకే కాకులంటారు
కాకుల్ని అందుకే కని పెట్టిబ్రతుకు.
తూరుపున తెలతెల్లవారంగ లేచీ
నిత్య కృత్యములెల్ల నెరవేర్చి పిదప
మజ్జనము గావించి మహలక్ష్మి పూజ
సలుపుచుండుమెపుడు సద్భక్తితోడ
సద్గ్రంథ పఠనంబు శ్రద్ధగాజెసి
పాతివ్రత్యపు కథలు పఠియించుమమ్మా
కన్నవారింటికిని కొన్నవారికిని
స్త్రీయొక్క శీలమే మూలమౌనమ్మా.
ఐశ్వర్య మెంతున్న అణిగుండవమ్మ
ఊరుకు మోడైన ఉరవడగియుండు
వరి వెన్ను ముదిరితే వంగియుండునుగా!
గంటి వెన్నూ ముదిరి గణికవలె నిలుచూ
శుచి శుభ్రములయెడ శ్రద్ధవహియించు
మానధనమునకన్న మరి ధనము లేదు
పాతివ్రత్యమె చాలు పరలోకగతికి.
అన్నిటికి మూలంబు ఆదిదేవుండే
రక్షకుండని నమ్మి భక్తితో బ్రతుకు.
బిడ్డ లెందరుయున్న డబ్బెంతయున్న
తాజేయు కర్మమే తనకు తోడౌను
కాలము మూల్యంబు కడుదొడ్డధనమూ
సద్వినియోగంబు సార్థక్యమొందు
జ్ఞాపకం బుంచుకో జ్ఞానార్జనంబు
వెండి బంగారాలు వెంట వస్తాయా?
అయురారోగ్యములతో ఐశ్వర్యములతో
పేరుదెచ్చుక బ్రతుకు పరులలో నెపుడు.

సంపాదన:

చామర్తి కనకయ్య, అలమూరు




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (మార్చి) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI



Chandamama, February, 1950 Photo by B. Ranganadhan

బిచ్చగాడివేషం

